

# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంగాదు

అందమును, రంగును మెచ్చుకొనుట చిన్నపిల్లకు సీతాకోక చిలుక నేర్పుచున్నది. అత్యల్పమైన మరియు సౌమ్యరూపంలో సహితం జీవితమును విలువైనదిగా లెక్కగొనుట ఆమె నేర్చుకొనుచున్నది.

మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్లు మరియు పసుచిగుళ్ల పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాలలో దంతక్షయం మరియు పసుచిగుళ్ల జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్లను మరియు పసుచిగుళ్లను ఫోర్‌హన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ భద్రపరుచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హన్స్' పసుచిగుళ్లకు గుణకారియైన డాక్టర్ ఫోర్‌హన యొక్క ప్రత్యేక పదార్థములు గల టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్నయడల పళ్లు తెల్లగా మెరయుచూ, పసుచిగుళ్లు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్లలను పంపండి: మేనర్స్' డెంటల్ అడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




C. 1

**COUPON**

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

Name ____________________

Address ____________________

____________________



ఏది
కావాలి
మీకు ?




# ప్యాక్ అండ్ ఫోల్డ్

ప్యాక్ అండ్ ఫోల్డ్ తడి పట్టని భోజన డబ్బీ రకరకాల రంగు రంగులలో ప్రతి చోటా దొరకును.



వెగట్ ఎన్‌టర్‌ప్రయిజెస్

2వ-క్రాస్ లేన్, విక్టోరియా రోడ్డు,
డోటివాలా ఎస్టేట్, బైకుల్లా,
బొంబాయి-27.

అన్ని వంటలకు శ్రేష్ఠమైన

# నూనెలు




అగ్‌మార్కు కాబడిన
ఏ.యస్. బ్రాండ్
చాయపప్పు
నూనె

అగ్‌మార్కు కాబడిన
మేన్షన్ బ్రాండ్......
నువ్వులనూనె




- గోదావరిడెల్టా నువ్వులనుండి ఆరోగ్యకరముగు ప్రత్యేకపద్ధతులతో తయారు కాబడినవి.
- రుచి,రంగు,సువాసనలతో అన్నివంటు పదార్థములను అమితముగురుచివంతముగ చేయును.
- ఊరగాయలను చాలకాలము నిలువయుంచును. ముక్కను మెత్తబడనీయవు, బూజుపట్టనీయవు.
- తలకు వాడినయెడల మెదడుకు చలువ చేయును. వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 16,4,2. కి.గ్రా. డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

డిస్ట్రిబ్యూటర్సు :
**M/s.** అశోక్ స్టోర్సు
183, శరత్‌బోస్ రోడ్,
దేశప్రియ పార్కు ఎదురుగా, కలకత్తా - 26
Mr. N. సత్యనారాయణ
129/L5 రోడ్ నెం. 11
B. H. ఏరియా, కద్మా, జంషెడ్‌పూరు
M/s. యిమ్మిడిశెట్టి రామకృష్ణయ్యా సన్సు
బరంపురం : ఫోన్ నెం. 43

MFRS, అంబటిసుబ్బన్న&కో. సామర్లకోట

వీనస్ పిక్చర్స్ సమర్పించు అశోక్ మూవీస్

# సుమంగళి



# చూస్తూండగానే! పారీ మిఠాయిలు మటుమాయమై పోతున్నాయి!

పారీ మిఠాయిలు లేకుండా ఒకక్షణం ఉండలేకపోతే మమ్మ ఎందుకు నిందించడము? దీనికి కారణమేమంటే: వాటి మంచి పుష్టికరమైన రుచి. ఏదైనవ్వటికీ పారీ మిఠాయిలతో జీవితం ఒక ఆటగా గడిచిపోతుంది. చిల్లరగానో లేక అందంగా అచ్చు వేయబడిన డబ్బాలుగానో కొనడానికి బయలుదేరండి. మీరు మీ కుటుంబము బంధువులతోబాటు తిని ఆనందించండి.

వీటిని వాడారా? లెమన్ బార్లీ కోకోనట్స్ జింజెర్ క్యాన్స్ డెవాన్ క్రీమీ టాఫీ లాక్టోబాన్‌బాన్స్




పారీస్ మంచి మిఠాయిలను తయారుచేవాయురు

పారీన్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్ మద్రాసు

IWT/PRS 2783

# డిసెంబర్ 23 విడుదల!



వి.ఎస్. ఫిలిమ్స్

# రామదాసు

దర్శకత్వం, సంగీతపర్యవేక్షణ: వి. నాగయ్య

మాటలు:
యడవల్లి లక్ష్మీనారాయణ.. మల్లాది సత్యనారాయణ

సంగీతం:
అశ్వత్థామ.. ఓగిరాల రామచంద్రరావు.. పద్మనాభ శాస్త్రి

నటీనటులు: వి.నాగయ్య.. గుమ్మడి.. లింగమూర్తి.. రామశర్మ.. ఎ.వి.సుబ్బారావు.. వసల సూర్యచంద్రరావు.. గోవిందరాజుల సుబ్బారావు.. శీల బ్రహ్మయ్య.. రామన్నపంతులు.. సి.ఎస్.ఆర్. ఆంజనేయులు.. రమణారెడ్డి.. లంకసత్యం.. వి.శివరామకృష్ణయ్య.. టెన్నిస్ రామారావు.. మాస్టర్ నాగరాజు.. వంగర వెంకటసుబ్బయ్య.. అల్లు రామలింగయ్య.. కన్నాంబ.. టంగుటూరి సూర్యకుమారి.. ఋష్యేంద్రమణి.. రాజశ్రీ.. రత్నపాప.. ప్రభావతి.. లక్ష్మి.. జెమిని చంద్ర......

గెస్ట్ ఆర్టిస్ట్స్: శివాజీగణేశన్.. ఎన్.టి.రామారావు.. అక్కినేని నాగేశ్వరరావు.. రేలంగి.. అంజలీదేవి

సీడెడ్: వెంకటనారాయణ ఫిలిమ్స్ (గుంటకల్) * * * * ఆంధ్ర-నైజాం-మైసూర్ ఈస్టిండియా ఫిలిం కంపెనీ



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈనాడు మనం వివరంగా తెలుసుకోదగిన ప్రాచీన నాగరికతలలో ఈజిప్టు నాగరికత గొప్పది. ఏడు వేల ఏళ్ళ క్రితం, ప్రపంచంలో మరెక్కడా లేని నాగరికత అక్కడ ఉండినట్టు పరిశోధకులు చెబుతున్నారు. ఒకే ఒక్క నది పై-నైల్ నది పై—ఆధారపడి వెలసిన ఈ నాగరికత యొక్క శిథిలాలు యీ నాటికీ అసంఖ్యాకంగా ఉన్నాయి.

"వెయ్యేళ్లనాటి బ్రిటను గురించి కన్న అయిదు వేలేళ్లనాటి ఈజిప్టు గురించి మన కెక్కువ తెలుస్తుంది," అన్నారు విజ్ఞులు. 5,000 ఏళ్లనాటి శవాలూ, ఆభరణాలూ, కుడ్య చిత్రాలూ, పరికరాలూ ఇప్పటికీ మనం చూడవచ్చు. ఈ నెల "ప్రపంచ వింతలు"లో ప్రచురిస్తున్న కార్నాక్ ఆలయ ద్వారం ఒక ఈజిప్షను శిథిలం.

సంపుటి : 36 - జనవరి 1965 - సంచిక : 1









# భారత చరిత్ర



బెంగాలును పూర్తిగా స్వాధీనపరచుకునే ఉద్దేశంతో షేర్ ఖాన్ 1537 అక్టోబరు మధ్యలో బెంగాలుపై దాడిచేసి, రాజధాని అయిన గౌర్‌ను ముట్టడించాడు. గుజరాతు, మాల్వాలను జయించి తిరిగివస్తూ ఆగ్రాలో జల్సాలలో మునిగి ఉన్న హుమాయూన్‌కు తన సామ్రాజ్యానికి తూర్పున ఎసరు వచ్చిందని చాలా ఆలస్యంగా తెలిసింది. అతను షేర్ ఖాన్‌ను ప్రతిఘటించటానికి డిసెంబరు రెండో వారంలో బయలుదేరాడు. బయలుదేరిన వాడు తిన్నగా గౌర్‌కు వెళ్ళక మధ్య దారిలో చునార్‌కు ముట్టడి వేశాడు. చునార్‌లోని సైన్యం మొగలు బలాలకు లొంగకుండా ఆరు మాసాలు నిలబడింది. ఈ ఆరు మాసాలలో షేర్ ఖాన్ బెంగాలులో యుద్ధం సాగించి, 1538 ఏప్రిలులో గౌర్‌ను నిర్జించాడు.

బిహారులో పరాభవం పొంది హుమాయూన్ 1538 జులైకి గౌర్ చేరుకునే సరికి, షేర్ ఖాన్ అతన్ని ప్రతిఘటించక, బిహారు జౌన్పుర్‌లలో గల మొగలు రాజ్య ప్రాంతాలపై దాడి చేసి, పశ్చిమాన కనౌజ్ వరకూ గల ప్రాంతాన్ని కొల్లగొట్టాడు.

ఈ లోపల గౌర్ వద్ద జల్సాలలో మునిగి ఉన్న హుమాయూన్ పడమటి ప్రాంతంలో షేర్ ఖాన్ చేస్తున్న చర్యలను గురించి విని కంగారు పడి, బెంగాలు నుంచి ఆగ్రాకు బయలుదేరాడు. దారిలో షేర్ ఖాన్ సేనలూ, అఫ్ఘాన్‌సేనలూ హుమాయూన్‌నెదిరించి చిత్తుగా ఓడించాయి (1539 జూను). మొగలు సేనలు నాశనమయాయి. గంగలోకి అనాలోచనగా దూకిన హుమాయూన్‌నొక నీరు మోసేవాడు కాపాడాడు. ఢిల్లీ సుల్తానుపై విజయం సాధించటంతో షేర్ ఖాన్ ఆధిపత్యం పడమట అస్సాం

**40. అఫ్ఘాన్ సామ్రాజ్య పునఃప్రతిష్ఠ**

పర్వత శ్రేణుల దాకా, తూర్పున చిటగాంగు దాకా, ఉత్తరాన హిమాలయాల దాకా, దక్షిణాన బంగాళాఖాతం దాకా విస్తరించింది. అతను షేర్ షా అనే బిరుదు ధరించి, తన పేర నాణాలు ముద్ర వేయించాడు.

మరుసటి ఏడు హుమాయూన్ తన రాజ్యం కొరకు మరొక యత్నం చేశాడు; ఈ యత్నంలో అతని సోదరుల సహకారం, ఎంత యత్నించినా, అతనికి లభించలేదు. 1540 మే 17 న కనౌజ్‌కి ఎదురుగా మొగలు, అఫ్ఘాన్ సైన్యాలు తలపడ్డాయి. అఫ్ఘానులే జయించారు. హుమాయూన్ ప్రాణాలతో తప్పించుకున్నాడు. ఈ విధంగా బాబరు చేసిన కృషి యావత్తూ నీరుగారి పోయి, హిందూస్థానం పై అఫ్ఘానుల ప్రభుత్వం తిరిగి నెలకొన్నది. ఇదిమొదలు పదిహేనేళ్ళ పాటు హుమాయూన్ దేశ ద్రిమ్మరిగా జీవించాడు.

ఈ స్థితిలో కూడా బాబరు మిగతా కొడుకులు హుమాయూన్‌కు అండగా నిలబడలేదు. హుమాయూన్ లాహోరు వెళ్ళి వాళ్ళ సహకారాన్ని ఎంతగానో అర్థించాడు; ప్రయోజనం శూన్యమయింది. ఈ పరిస్థితులలో షేర్ షా తన రాజ్యాన్ని సులువుగా విస్తరించుకున్నాడు. అతను పంజాబులో



కొంత భాగం జయించాడు; 1542 లో రాజపుత్రులతో యుద్ధం చేసి మాల్వాను లోబరచుకున్నాడు; మధ్య భారతంలోని రాయిసిన్ దుర్గం పై దండెత్తి వెళ్ళాడు. కొంత ప్రతిఘటన జరిపి చివరకు రాయిసిన్ దుర్గమూ, సేనలూ ఓటమి అంగీకరించాయి. తమను క్షేమంగా మాల్వా దాటి వెళ్ళి పోనిస్తే దుర్గాన్ని అఫ్ఘానుల పరం చేస్తామన్నారు రాజపుత్రులు. కాని, వారు దుర్గం నుంచి బయటికి రాగానే అఫ్ఘానులు దుర్గంపైన పడి దౌష్ట్యం సాగించారు. తమ భార్యా బిడ్డల మానాలను కాపాడగలందులకై వారిని రాజపుత్రులు చంపేసి,

శత్రువులతో వీరోచితంగా పోరాడుతూ, ప్రాణాలర్పించారు. ఇది 1543లో జరిగింది. ఈ సంఘటన షేర్ షాకు పెద్ద కళంకంగా భావించబడుతున్నది.

పంజాబులోని షేర్ షా ప్రతినిధి సింధు, ముల్తాను రాజ్యాలను అఫ్ఘాను సామ్రాజ్యంలో చేర్చాడు. ఇక షేర్ షాకు మిగిలిన ప్రబల శత్రువు మార్వారు రాజైన మాల్దేవుడు. అతను యుద్ధకోవిదుడు. అతని రాజ్యం 10 వేల చదరపు మైళ్ళ మేర విస్తరించింది. మాల్దేవుడికి ఓడిపోయిన రాజపుత్రులు కొందరు ప్రేరేపించగా, షేర్ షా 1544 లో అతని పైకి దండెత్తి వెళ్ళాడు. మాల్దేవుడు యుద్ధానికి సిద్ధంగానే ఉన్నాడు.

అయితే మాల్దేవుడి బలాలతో అతని దేశంలోనే తలపడటానికి జంకి, షేర్ షా కుయుక్తి పన్నాడు; కొందరు రాజపుత్ర సేనాపతులు తనకు సహాయపడతామని వాగ్దానం చేసినట్టు లేఖలు సృష్టించి వాటిని మాల్దేవుడికి పంపాడు. మాల్దేవుడు బెదిరిపోయి, యుద్ధ ప్రయత్నం మానేసి, తన సివన్ దుర్గంలో దూరి దాక్కున్నాడు. అయినప్పటికీ అనేక మంది రాజపుత్ర వీరులు తమ బలాలతో అఫ్ఘాను సేనల నెదిరించి, అద్వితీయ పరాక్రమం ప్రదర్శించి పోరాడారు. యుద్ధంలో చివరకు షేర్‌షా గెలిచాడే గాని, అనేక వేలమంది సైనికులను పోగొట్టుకుని, తన సామ్రాజ్యాన్ని కూడా పోగొట్టుకున్నంత పని చేశాడు. అదే రాజపుత్రులకు చావు దెబ్బ కూడా అయింది. ఉత్తర హిందూస్థానం పై అఫ్ఘాన్ పరిపాలన ఏర్పడింది. షేర్ షా అజ్మీరు నుంచి అబూ వరకూ గల ప్రాంతాన్నంతా క్రమంగా జయించుకుంటూ వచ్చాడు. చివరకు అతను కాలింజర్ దుర్గాన్ని ముట్టడించి, లోబరచుకున్నాడు. ఈ సమయంలో— 1545 మే 22న తుపాకి మందు పేలిన కారణంగా షేర్ షా చనిపోయాడు.



# నేహ్రూ కథ

## 7

1915 ఫిబ్రవరి 19 న గోఖలే మరణిం చటంతో రాజకీయ మితవాదుల పక్షం దుర్బల మైపోయింది. 1893 ఏప్రిలులో దక్షిణాఫ్రికాకు వెళ్ళిపోయిన గాంధీ, గోఖలే కొద్ది రోజులలో పోతాడనగా—1915 జనవరి 9 న—తిరిగి స్వదేశంలో అడుగు పెట్టాడు. ఒక సంవత్సరం పాటు రాజకీయా లలో ప్రవేశించనని ఆయన గోఖలేకు మాట ఇచ్చి, ఆ సంవత్సర మంతా దేశసంచా రంలో గడిపాడు.

యుద్ధ ప్రయత్నానికి వ్యతిరేకంగా దేశంలో ఉద్యమమేమీ లేదు. దేశంలో కొత్తగా ఏర్పడుతున్న నేషనల్ డిఫెన్స్ ఫోర్సులో జవాహర్ చేర నిశ్చయించి దర ఖాస్తు కూడా పెట్టాడు. గాంధీ కూడా యుద్ధ సహాయం చేస్తానని బ్రిటిషు అధికారులకు మాట ఇచ్చాడు. మోతీలాలు భార్యలాగే గాంధీ భార్య కస్తూర్బా కూడా సైనికులకు గాను దుస్తులు వగైరాలు తయారు చేసింది. 1915 జూను 3 న బ్రిటిషు రాజు జన్మ దిన సందర్భంలో, యుద్ధంలో బ్రిటిషు వారికి తోడ్పడి "బ్రిటిషు సామ్రాజ్య సేవ"



చేసినందుకు గాంధీకి కేజరీ హింద్ పతకం బహూకరించటం కూడా జరిగింది.

ఈ పరిణామాలు జవాహర్ లోని అశాం తిని అణచలేక పోయాయి. అతనిలో ఇప్పుడు సోషలిస్టు భావాలు కూడా లేవు, జాతీయ భావాలు బాగా ప్రకోపించాయి. కాని మనిషి ఇంకా బిడియపడుతున్నాడు. నలుగురి ఎదట నిలబడి ఉపన్యసించే ధైర్యం లేదు. 1915 లో ఏదో ఒక చిన్న మీటింగులో అతను లేచి నిలబడటానికి సమ్మతించి, రెండు ముక్కలు మాట్లాడే సరికి, వేదిక మీద ఉన్న తేజ్ బహదుర్ సప్రూ అతన్ని వేదిక మీదనే ఆలింగనం



దేశంలోని హిందూ ముస్లిము వర్గాల మధ్య సామరస్యం కుదిరే ఏర్పాటును హర్షించాడు. జాతీయ కాంగ్రెసుకూ, ముస్లిము లీగుకూ సామరస్యం కుదరకపోతే దేశానికి భవిష్యత్తు లేదని మోతీలాలు కూడా భావించాడు. 1916 లో మోతీలాల్ ఇంట్లో కాంగ్రెసు కమిటీ సమావేశం జరిగినప్పుడు హిందూ ముస్లిముల మధ్య ఒక ఒప్పందం ముసాయిదా ఆమోదించబడింది. 1916 డిసెంబరులో జరిగిన లక్నో కాంగ్రెసు సమావేశంలో ఈ ముసాయిదా ఆమోదించబడింది.

హిందూ ముస్లిము సమైక్యతకు గాను గట్టిగా కృషి చేసిన ముస్లిము నాయకులు అబుల్‌కలామ్ ఆజాద్, షౌకతలీ, మహమ్మదలీ సోదరులూనూ.

ఈ లక్నో సమావేశంలోనే జవాహర్ మొదటిసారి గాంధీని చూశాడు. అప్పటికింకా గాంధీకి భారతీయ రాజకీయ రంగంలో నామరూపాలు లేవు. ఆ కిందటేడు జరిగిన బొంబాయి కాంగ్రెసు సమావేశమప్పుడు ఏదో కమిటీకి సభ్యుడుగా ఆయనకు ఓట్లు రాకపోతే అధ్యక్షుడు "నామినేట్" చెయ్యవలిసి వచ్చింది. లక్నో సమావేశంలో కూడా ఆయన నెవరూ పరిగణించలేదు. చాలా

చేసుకుని ముద్దు పెట్టుకున్నాడు. "ఇందుకు కారణం నేను మాట్లాడిన విషయమూ కాదు, విధానమూ కాదు. ఆయన ఆనందానికి కారణం నేను పదిమందిలో లేచి మాట్లాడటమే. కొత్త ప్రజాసేవకులు కావాలి. ప్రజాసేవంటే ఆ రోజుల్లో మాట్లాడటమే," అన్నాడు నెహ్రూ!

రాజకీయాలలో మత విశ్వాసాలను చొప్పించటమంటే జవాహరుకు తగని మంట. అందు చేతనే తిలక్ జాతీయవాదం అతన్ని బలంగా ఆకర్షించినప్పటికీ, ఆయన మత భావాలు అతనికి ఏవగింపు కలిగించేవి. ఈ కారణంగా అతను, భారత

మందికి గాంధీ ఎలా ఉంటాడో కూడా తెలియదు. లక్నో సమావేశంలో ప్రముఖుడుగా నిలబడినవాడు తిలక్.

1916 ఏప్రిల్‌లో తిలక్ మొట్ట మొదటగా దేశంలో ఒక హోమ్ రూల్ లీగ్ ఏర్పరచాడు. భారతీయ రాజకీయాలలో మునిగి తేలుతున్న అనీబిసెంట్ కూడా హోమ్ రూల్ లీగ్ ఏర్పరచింది. ఆమె జాతీయోద్యమానికి చాలా చైతన్యం చేకూర్చింది. జవాహర్ గాంధీ ప్రభావానికి గురికాక పూర్వం అతనిపై అనీబిసెంటు ప్రభావమూ, కాంగ్రెసు అధ్యక్షస్థానాన్ని మొట్ట మొదటగా అలంకరించిన సరోజినీ నాయుడు కవితా ప్రభావమూ చాలా హెచ్చుగా ఉండేవి.

1917 ఆరంభంలో గాంధీజీ కదిలాడు. ఉత్తర బిహారులోని చంపరాన్ నీలి తోటలలో కార్మికుల కడగండ్లను గురించి విని గాంధీజీ అక్కడికి వెళ్ళాడు. తోటల యజమానులైన తెల్లవాళ్ళు ప్రభుత్వం అండ చూసుకుని బిర్ర బిగిశారు. చంపరాన్ వదిలి వెళ్ళిపోవలసిందిగా గాంధీజీకి ఉత్తరువు జారీ అయింది. కార్మికుల కష్టాలను గురించి తన విచారణ పూర్తి అయినదాకా వెళ్ళేది లేదన్నాడు గాంధీజీ. దానిపై కోర్టుకు హాజరు



కమ్మని సమను వచ్చింది. గాంధీజీ వెళ్ళాడు. ఆయన కోర్టులో "ముద్దాయిగా" చెప్పిన మాటలకు అధికారులకు కంపర మెత్తి ఆయన పైన ఆరోపించిన కేసును చప్పున ఉపసంహరించేసుకున్నారు. అంతే కాదు, ఆయన విచారణను సాగనిచ్చి, తామే ఒక విచారణ సంఘాన్ని వేసి, అందులో గాంధీజీకి స్థానమిచ్చారు. వీటన్నిటి ఫలితంగా ఒక చట్టం ఏర్పడి చంపరాన్ కార్మికుల కష్టాలు చాలావరకు సర్దుబాటయాయి. ఈ విధంగా భారతదేశంలో తన పద్ధతులు ఫలిస్తాయని గాంధీజీ మొట్ట మొదటి సారిగా నిరూపించాడు.

దేశంలో చైతన్యం నానాటికీ ప్రబల మవుతున్నది. జవాహర్ చాలా ఉద్రేక స్వభావుడు. అతను టెర్రరిస్టులతో చేరి పోతాడేమోనని తండ్రి మోతీలాలు చాలా భయపడ్డాడు. అలాటి వాళ్ళకు జైళ్ళూ, ఉరిశిక్షలూ తప్ప మరోటి ఉండదు. ఆయన స్వతహాగా మితవాది. అతివాద దృక్పథా లేవీ ఆయనకు గిట్టవు. కాని కొడుకు చూడ బోతే జాతీయ భావోద్రేకంలో ఉన్నాడు. తండ్రి హృదయం అటుకేసి కూడా లాగు తూనే ఉన్నది.

మోతీలాల్ ఇలాటి భావసంఘర్షణలో చిక్కుకుని ఉండగా **1917** జూనులో ప్రభుత్వం అనీ బిసెంటును నిర్బంధంలో పెట్టింది. ఇందువల్ల హోమ్ రూల్ ఉద్యమం సన్నగిలకపోగా వృద్ధి అయింది. అనేకమంది మితవాదులు అందులో ప్రవే శించారు. వారిలో మోతీలా లొకడు. ఆయ నకు అనీ బిసెంటంటే ఎంతో గౌరవాభి మానా లుండేవి. అందుచేత ఆయన హోమ్ రూల్ లీగులో సభ్యుడుగా చేరి, తరవాత అలహాబాదులో దానికి అధ్యక్షుడు కూడా అయాడు.

జర్మనీ తోటి యుద్ధంలో మిత్రరాజ్యా లకు చుక్కెదురుగా ఉంటూ వచ్చింది. ఇండియా పట్ల బ్రిటిషు వైఖరిలో కొద్ది మార్పు వచ్చింది.

సెప్టెంబరులో అనీ బిసెంటును విడుదల చేశారు. భారత రాజ్యాంగంలో సంస్క రణలు చేస్తామన్నారు.

అలహాబాదులో కాంగ్రెసు వర్కింగు కమిటీతో బాటు ముస్లిం లీగు ఒక సమా వేశం జరిపి దేశానికి స్వపరి పాలనాధికారం కావాలని అడగ నిర్ణయించారు. "ఆపత్స మయంలో బ్రిటిషు సామ్రాజ్యానికి, స్వయం పరిపాలనాధికారం గలిగి సంతుష్టి చెందిన భారతదేశం గొప్ప అండగా ఉండగలదు," అన్నాడు తిలక్.






## 8

[మందారణ దుర్గం పఠాను సేనానాయకుడైన ఉస్మాన్‌ఖాన్ వశమయింది. దుర్గేశుడైన వీరేంద్రసింహుడు గాయపడి బందీగా చిక్కిపోయాడు. అతని కుమార్తె తిలోత్తమా, ఆమె పరిచారిక విమలా ఉస్మాన్‌ఖాన్ వశమయారు. పఠానుల ఔద్ధత్యాన్ని అణచటానికి కంకణం కట్టుకుని ఉన్న జగతసింహుడు—రాజామానసింహుడి కుమారుడు—తన ప్రియురాలైన తిలోత్తమను ఒక్కసారి కలుసుకునే ఉద్దేశంతో దుర్గంలో ప్రవేశించి, పఠానులతో తీవ్రంగా పోరాడి గాయపడి, కొనప్రాణంతో పఠానులకు దొరికిపోయాడు.]

జగతసింహుడికి తిరిగి స్పృహ వచ్చింది. అతను కళ్ళు తెరిచి చూశాడు. అత నిప్పొక రమణీయమైన గదిలో శయ్యపైన పడుకుని ఉన్నాడు. అది చాలా విశాలమైన గది. దాన్ని అత నెన్నడూ చూసి ఉండలేదు. అది నిర్జనప్రదేశంలాగా నిశ్శబ్దంగానూ, ప్రశాంతంగానూ ఉన్నది. ఒక స్త్రీ అతని పాదాల దిక్కున కూర్చుని, అతనిపై సుగంధజలం చిలుకుతూ, విసరుతున్నది. మరొకతె కొంత దూరంలో మాటా పలుకు లేకుండా నిశ్చలంగా నిలబడి ఉన్నది. జగతసింహుడు పడుకుని ఉన్న దంతపు మంచంపైననే ఒక అందమైన, బలిష్ఠుడైన పఠాను ఉత్కృష్టమైన దుస్తులు ధరించి కూర్చుని, తాంబూలం నములుతూ, ఏదో పార్సీ గ్రంథం చదువుకుంటున్నాడు.

బంకించంద్ర చట్టోపాధ్యాయ



"మీరు మాట్లాడకండి. మీరున్నది మంచి చోటే. విచారించక, విశ్రాంతి పొందండి."

"ఇప్పు డేవేళ అయి ఉంటుంది?"

"మూడో జాము. నిశ్చింతగా ఉండండి. మాట్లాడి హైరాన తెచ్చుకుంటే త్వరగా కోలుకోలేరు. మీరు మౌనంగా ఉండనట్టయితే మే మందరమూ ఇక్కడి నుంచి వెళ్ళిపోతాం."

అతికష్టం మీద యువరాజు మరోసారి, "ఇంకొక్క మాట. నువ్వెవరు?" అన్నాడు.

"అయుషా."

వారిలో ఏ ఒక్కరూ మాట్లాడటం లేదు. అంతా నిశ్శబ్దం.

యువరాజు చుట్టూ కలయజూసి పక్కకు ఒత్తిగిలటానికి ప్రయత్నించాడు. కాని అతనికి అది సాధ్యం కాలేదు, పైగా సర్వాంగాలలోనూ భరించరాని బాధ కలిగింది. ఒత్తిగిలటానికి అతను చేసిన ప్రయత్నం గమనించి కాళ్ళ దిక్కుగా కూర్చుని ఉన్న యువతి కోకిల కంఠంతో, "కదలకండి. ఎలా పడుకునివున్నారో, అలాగే ఉండిపొండి," అన్నది.

అతను హీనస్వరంతో, "నే నెక్కడ ఉన్నాను?" అని అడిగాడు.

అతను అయుషా కేసి దీర్ఘంగా చూశాడు. ఆమెను పూర్వ మెన్నడూ అతను చూసి ఉండినట్టు లేదు.

అయుషా వయస్సు సుమారు ఇరవై రెండుండవచ్చు. ఆమె అపురూపలావణ్యవతి. ఆమెను అలాగే చూస్తూ ఉన్న జగతసింహుడికి తిలోత్తమ జ్ఞాపకం వచ్చింది. వెంటనే అతని గుండె అవిసినట్టయిపోయింది; రక్తం ఉడుకెత్తి పోయింది; అతని గాయాల నుంచి తిరిగి రక్తస్రావం ప్రారంభమయింది; అతనికి వెంటనే స్పృహ తప్పింది.



అయుషా కంగారుపడి లేచింది. మంచం పైన కూర్చుని పుస్తకం చదువుకుంటున్న వ్యక్తి మధ్య మధ్య కళ్ళెత్తి అయుషా కేసి ప్రేమగా చూస్తున్నాడు. అయుషా అతని చెవిలో చిన్నగా, "ఉస్మాన్, వెంటనే హకీముకు కబురు చెయ్యి," అన్నది.

వెంటనే ఉస్మాన్ లేచి బయటికి వెళ్ళిపోయాడు. ఆమె మంచం పక్కనే ఉన్న వెండి ముక్కాలిపీట నుంచి ఒక పాత్ర తీసుకుని, అందులోని ద్రవాన్ని యువరాజు ముఖం పైన చిలకరించింది.

త్వరలోనే ఉస్మాన్‌ఖాన్ హకీమును వెంటపెట్టుకుని తిరిగి వచ్చేశాడు. హకీమ్ శ్రద్ధగా రక్తస్రావాన్ని నిలిపేశాడు. అతను కొన్ని మందు లిచ్చి, పరిస్థితి వివరించి వెళ్ళిపోవటాని ఉద్యుక్తుడయాడు.

అయుషా హకీమ్ చెవిలో రహస్యంగా, "ఆయన కెలా ఉన్నదంటారు?" అన్నది.

"జ్వరం ప్రమాదకరంగానే ఉన్నది," అని చెప్పి హకీమ్ బయలుదేరాడు. ఉస్మాన్‌ఖాన్ అతన్ని వాకిలి దాకా సాగనంపి, "ప్రాణ భయం లేదు గద?" అన్నాడు.

"చూడండీ, తిరిగి బాధలు ప్రకోపించే పక్షంలో నాకు కబురు పెట్టండి," అని హకీమ్ వెళ్ళిపోయాడు.



ఆ రాత్రి చాలా పొద్దు పోయినదాకా అయుషా, ఉస్మాన్‌ఖాన్‌లు మేలుకుని ఉన్నారు. అతనికి స్మృతిలేదు. హకీమ్ చాలాసార్లు వచ్చి అతన్ని చూసి వెళ్ళాడు. అయుషా అతనికి విడవకుండా సపర్యలు చేస్తున్నది. రాత్రి మూడో జామున పరిచారిక వచ్చి, "బేగమ్ సాహెబాగారు తమరిని హెచ్చరించ మంటున్నారు," అన్నది.

"ఇదుగో వస్తున్నాను," అంటూ అయుషా లేచి నిలబడింది. ఉస్మాన్ కూడా మంచం మీంచి లేచాడు.

"నువు కూడా బయలుదేరుతున్నావా?" అని అయుషా అతన్ని అడిగింది.





"చాలా పొద్దు పోయింది. పద, నిన్ను అంతదాకా దిగబెడతాను," అన్నాడు ఉస్మాన్‌ఖాన్.

ఆయుషా అక్కడి దాసీలకు చెప్పవలసిందంతా చెప్పి, రాజకుమారుణ్ణి వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉండమని హెచ్చరించి, తన తల్లి వద్దకు బయలుదేరింది.

దారిలో ఉస్మాన్, "ఇవాళ నువు బేగమ్ సాహెబా దగ్గిరే ఉంటావా?" అని అడిగాడు.

"లేదు. తిరిగి రాజకుమారుడి వద్దకు వచ్చేస్తాను," అన్నది ఆయుషా.

"ఆయుషా, నీ మంచితనానికి మితి ఉన్నట్టు కనబడదు. ఈ గర్భ శత్రువుకు నువు చేసే సేవ తోడబుట్టిన చెల్లెలు కూడా చెయ్యదు. నువ్వితనికి ప్రాణదానం చేస్తున్నావు."

ఆయుషా చిరునవ్వుతో, "ఉస్మాన్, నాది స్త్రీ స్వభావం. బాధితులకు సేవ చెయ్యటం కన్న నాకు గొప్ప ధర్మంలేదు. కాని నీ దయ మాత్రం తక్కువైనదా? నీ ప్రబల శత్రువును బతికించాలని నువ్వెందుకు చూస్తున్నావు?" అన్నది.

"నువు ఉదారహృదయం గల దానివి కనక నేనూ అంతేననుకుంటున్నావు. కాని అసలు సంగతి వేరు. నా అభిప్రాయమేమంటే, జగతసింహుడు మన చేత చిక్కి ఉండగా మానసింహుడి జుట్టు మన చేతిలో ఉన్నట్టే; మనకు లాభించే విధంగా ఆయనతో సంధి చేసుకో గలుగుతాం. అలా జరగని పక్షంలో కూడా, జగతసింహుణ్ణి తనకు అప్పగించి నందుకు మానసింహుడు పుష్కలంగా ధనమిస్తాడు. అందుచేత జగతసింహుడి ప్రాణాలు కాపాడటం మనకు లాభదాయకం. ఆ విషయంలో నేను ఉపేక్ష వహించలేను," అన్నాడు ఉస్మాన్.

"ఉస్మాన్, అందరూ నీలాగా స్వార్థంతో కూడిన దూరదృష్టి గలవారైతే ఇక ధర్మంతో పనే ఉండదు," అన్నది ఆయుషా.

ఉస్మాన్ మాట్లాడలేదు. అతను ఆయ షాను బేగం మందిరానికి చేర్చి, తాను పడు కుని నిద్రపోవటానికి వెళ్ళిపోయాడు.

మర్నాడు సాయంకాలం దాకా జగత సింహుడి స్థితి ప్రమాదకరంగానే ఉన్నది. హకీమూ, ఉస్మాన్‌ఖానూ, ఆయషా అతని వద్దనే ఉన్నారు. హకీము అతని పరిస్థితికి తగిన ఔషధమిచ్చాడు. అది పనిచెయ్యటం ప్రారంభించగానే ఆయన, "జ్వరం తగ్గి పోతున్నది. ఇక రోగికి భయం లేదు," అని చెప్పేశాడు. ఈ మాట వినగానే ఆయషా ముఖమూ, ఉస్మాన్ ముఖమూ వికసించాయి.

హకీమ్ వెళ్ళిపోయాడు. ఉస్మాన్‌ఖాన్ కూడా పడుకోవటానికి వెళ్ళాడు. ఆయషా మాత్రం రాజకుమారుడి దగ్గరే ఉన్నది.

అర్ధరాత్రి దాటినాక జగతసింహుడు కళ్ళు తెరిచి చూశాడు. అతనికి ఆయషా ముఖబింబం కనిపించింది. కాని అతను ఎవరి కోసమో కళ్ళతో వెతుకుతూ, వారు కనిపించక బాధపడుతున్నట్టుగా కనపడ్డాడు.

చాలాసేపయాక అతను ఆయషాను, "నే నెక్కడ ఉన్నాను?" అని అడిగాడు.

"కతలూఖాన్ కోటలో," అని ఆయషా జవాబు చెప్పింది.



అతను కొంచెం ఆలోచించి, "ఇక్కడెందుకున్నానూ?" అన్నాడు.

"ఎక్కువగా మాట్లాడకండి. మీకు ఒంట్లో బాగాలేదు."

"కాదు, కాదు, నేనిక్కడ ఖైదీని!... నువ్వెవరు?"

"ఆయషాను; కతలూఖాన్ కుమార్తెను."

"ఆయషా! కతలూఖాన్ కుమార్తె!... నే నిక్కడ ఎంతకాలంగా ఉన్నాను?"

"నాలుగు రోజులుగా."

"మందారణ దుర్గం ఇంకా మీ వశంలోనే ఉందా?"

"అవును."



"వీరేంద్రసింహు డేమయాడు?"

"ఆయన బందీగా కారాగృహంలో ఉన్నారు. ఇవాళే అయన విచారణ."

జగతసింహుడి ముఖం వాడిపోయింది. "ఇంకా—మిగిలిన వాళ్ళ మాటేమిటి?" అని అతనడిగాడు.

"అన్ని విషయాలూ నాకు తెలీవు," అన్నది అయుషా, కలవరపడుతూ.

రాజకుమారు డేదో తనలో తాను గొనగ సాగాడు. ఆ గొణుగుడులో "తిలోత్తమ" అనే మాటను అయుషా పదే పదే విన్నది. ఆమె లేచి వెళ్ళి అతనికి మందు తెచ్చి ఇచ్చింది.

"నేను చావు బతుకుల మధ్య ఉండి ఒక కల గన్నాను. ఎవరో దేవకన్య నా తల వైపున కూర్చుని నాకు పరిచర్యలు చేసింది. అది నీవా, లేక తిలోత్తమా?" అని జగత సింహు డడిగాడు.

"మీకు కలలో కనిపించినది తిలోత్తమే అయి ఉండవచ్చు," అన్నది ఆయుషా.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు కతలూ ఖాన్ దర్బారు తీర్చాడు. ఈ రోజే వీరేంద్రు డికి శిక్ష పడుతుంది. కొందరు సైనికులు వీరేంద్రసింహుణ్ణి సంకెళ్ళతో సహా దర్బారు లోకి తీసుకువచ్చి, కతలూఖాన్‌కు ఎదురుగా నిలబెట్టారు. వీరేంద్రసింహుడి ముఖం నిప్పుల కుంపటిలాగా ఉన్నది. ఆయనలో భయ చిహ్నలేవీ లేవు.

కతలూఖాన్ శాంతంగా, "వీరేంద్రసింహా, ఈ దర్బారులో నీ అపరాధాలను గురించి విచారణ జరగనున్నది. ముందు ఒక మాట చెప్పు: నీవు మాకు విరుద్ధమైన చర్య లెందుకు చేశావు?" అని అడిగాడు.

"నేను నీకు విరుద్ధంగా చేసిన చర్య లేవో అది ముందు నీవే చెప్పు," అన్నాడు వీరేంద్రసింహుడు కోపోద్రేకంతో.

"మర్యాదగా మాట్లాడు!" అని ఒక సభికు డాయనను హెచ్చరించాడు.

"నా ఆజ్ఞానుసారం నీవు ధనాన్నీ, సేననూ ఎందుకు పంపలేదు?" అని కతలూ ఖాన్ అడిగాడు.

"నీవు రాజద్రోహివి! బందిపోటువు! నీకు నేను ధనం ఎందుకు పంపాలి? సేన ఎందుకు పంపాలి?" అని వీరేంద్రసింహుడు నిర్భయంగా ప్రశ్నించాడు.

ఆయన చేజేతులా తన మరణాన్ని తెచ్చి పెట్టుకుంటున్నట్టు సభికులకు స్పష్టమయింది.

కతలూఖాన్ క్రోధోద్రేకంతో కంపించాడు. అయినా అతను తన క్రోధాన్ని నిగ్రహించుకుంటూ, "మా పరిపాలనలో ఉన్నవాడివి శత్రుపక్షంతో ఎందుకు చేరిపోయావు?" అని అడిగాడు.

"నీ అధికారం ఎక్కడ?" అని వీరేంద్రసింహుడు గట్టిగా అడిగాడు. కతలూఖాన్ కోపం ఇనుమడించింది.

"విశ్వాసఘాతకుడా, విను. శీఘ్రంగానే నీ చర్యలకు తగిన ఫలితం పొందనున్నావు. నీ కింకా ప్రాణాలు దక్కించుకునే అవకాశం ఉన్నది, కాని వెర్రిగా నీవా అవకాశాన్ని నాశనం చేసుకుంటున్నావు," అన్నాడు కతలూఖాన్.

వీరేంద్రసింహుడు పెద్దపెట్టున నవ్వి, "కతలూఖాన్, నేను శృంఖలాబద్ధుణ్ణయి



నీ ఎదటికి వచ్చినది నీ దయాదాక్షిణ్యాలను నమ్ముకుని కాదు. నీ వంటి శత్రువు యొక్క దయాదాక్షిణ్యాల ఆధారంతో ప్రాణాలు దక్కించుకునే వాడు జీవించి ఉండవలిసిన అవసరమేమున్నది? నేను నిన్ను ఆశీర్వదించి నా ప్రాణాలను త్యజించి ఉందును, కాని నీవు నా వంశానికి చిచ్చుపెట్టావు; నాకు ప్రాణం కన్న ఎక్కువైన..." అని అంటుండగా ఆయన కంఠం రుద్ధమై మాట పెగలలేదు. కళ్ళ వెంట నీటిధారలు కారసాగాయి. ఆయన తల వంచి రోదించాడు.

కతలూఖాన్ క్రూరుడు, కఠినుడు, ఇతరుల దుఃఖం చూసి నిశ్చింతగా ఉండగలవాడు. దర్పం గల శత్రువు అలాటి దుఃఖంలో ఉండటం చూసి అతని ముఖాన మందహాసం తాండవించింది. అతను వీరేంద్రసింహుడితో, "నన్ను నీవేమీ అడగబోవటం లేదా? బాగా ఆలోచించుకుని మాట్లాడు! నీకు కాలం ఆసన్నమవుతున్నది," అన్నాడు.

వీరేంద్రసింహుడు, "నిన్ను మరేమీ కోరను. నన్ను సాధ్యమైనంత శీఘ్రంగా మృత్యువు వాతపడవెయ్యి," అన్నాడు తల ఎత్తి.

"అలాగే...ఇంకేమన్నా ఉందా?"

"లేదు. ఈ జన్మ కింకేమీ లేదు."

"చచ్చే ముందు నీ కుమార్తెను ఒకసారి చూడవా?"

వీరేంద్రసింహుడి కళ్ళు మళ్ళీ అశ్రుపూరితాలయాయి. ఆ కళ్ళ నుంచి అదే సమయంలో నిప్పురవ్వలు కూడా వెలువడ్డాయి. "ఒకవేళ నా కుమార్తె నీ యింట ప్రాణాలతో ఉన్నపక్షంలో నా కామెను చూడాలన్న కోరిక లేదు. ఒకవేళ ఆమె చచ్చిపోయి ఉంటే తీసుకురా! ఆమెను నా ఒడిలో పెట్టుకుని మరణిస్తాను," అన్నాడాయన. —(ఇంకా వుంది)






# రాజ్యకాంక్ష

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు శ్రమపడితే పడ్డావుగాని, శ్రమ ఫలితం చేతికందే సమయానికి దాన్ని జయమల్లుడి లాగా జారవిడిచేవు సుమా! శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు జయమల్లుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

ఒకప్పుడు పైరన దేశంలోని రాజులందరూ సమావేశమై తమలో తాము యుద్ధాలు చేసుకో కూడదనీ, యుద్ధాల వల్ల అందరికీ నష్టమే కలుగుతున్నదనీ, రాజ్యాలన్నీ సఖ్యంగా ఉన్న పక్షంలో ప్రజల సుఖసౌఖ్యాలు పెంపొంది సుభిక్షం ఏర్పడుతుందనీ నిశ్చయించుకున్నారు. పైరనదేశంలోని ఒక తరం రాజు లీ ఒప్పందాన్ని చిత్త



శుద్ధిగా పాటించారు. అయితే అన్ని దేశాలూ ఇందువల్ల సత్ఫలితాలను పొందలేదు. వీర మల్లు డనే వాడి రాజ్యంలో దుర్మార్గులు విజృంభించారు, అరాచకం పెరిగింది. వీర మల్లుడు మరీ సాధువు కావటంచేతా, వయసు మీరినవాడు కావటంచేతా అరా చకం గురించి ఉదాసీనుడుగా ఉండి పోయాడు. కాని కొత్తగా రాజ్యానికి వచ్చిన పొరుగు రాజు ఇంద్రదత్తు డనేవాడు తన సరిహద్దు మీద అరాచకం తాండవించటం సహించలేక పోయాడు. తన తండ్రి తరం వాళ్ళు చేసుకున్న ఒప్పందం అంత మంచిది కాదనీ, రాజైనవాడు బలప్రయోగం ద్వారా పాలించకపోతే కోరలు తీసిన పాముకన్నా అసమర్థు డైపోతాడనీ అతని విశ్వాసం.

అందుచేత ఇంద్రదత్తుడు వీరమల్లుడి పైన యుద్ధం ప్రకటించి, సైన్యాలతో సహా దండెత్తి వచ్చాడు. ఇంద్రదత్తుడి ఈ ప్రయ త్నాన్ని నిలిపించమని వీరమల్లుడు మిగిలిన రాజులకు కబురు చేశాడు. వారు ఒకరి రాజకీయ విషయాలలో మరొకరు జోక్యం కలిగించు కోవటం తమ తండ్రులు చేసు కున్న ఒప్పందానికి విరుద్ధమని చెప్పి తప్పించుకున్నారు. వీరమల్లుడికి యుద్ధం చెయ్యాలన్న కోరికగాని, యుద్ధం చేసే శక్తి గాని లేదు. అందుచేత అతను తన భార్యనూ, చిన్న కొడుకునూ వెంట బెట్టు కుని వింధ్యారణ్యాలలోకి పారిపోయాడు.

ఒక్క చుక్క కూడా రక్తం చిందకుండా వీరమల్లుడి రాజ్యం ఇంద్రదత్తుడి వశ మయింది. అతను కఠినమైన శాసనాలు ప్రయోగించి, దేశంలోని దుష్టశక్తు లన్నిటినీ నిర్మూలించి, ప్రజల జీవితాన్ని చక్క బెట్టాడు, ప్రజాక్షేమం చక్కగా సాధించాడు.

వింధ్యాటవులలో నివాసం ఏర్పరుచు కున్న వీరమల్లుడు కొంతకాలానికి చని పోతూ, తన కొడుకైన జయమల్లుణ్ణి పిలిచి, అతనితో తనకు రాజ్యనష్టం ఎలా జరిగినదీ

చెప్పి, "నాయనా, నేను ఒక ఒప్పందానికి కట్టుబడి నా శత్రువైన ఇంద్రదత్తుడితో యుద్ధం చెయ్యక, రాజ్యం విడిచి పారి పోయి వచ్చేశాను. కాని నీకు రాజ్యకాంక్ష ఉన్న పక్షంలో ఇంద్రదత్తుణ్ణి ఓడించి నీ రాజ్యం నువు తీసుకో. మా తరం వాళ్ళం చేసుకున్న ఒప్పందం నీకు వర్తించదు. నువ్విప్పుడు రాజువైనా కావు," అన్నాడు.

తండ్రి కన్ను మూశాక జయమల్లుడు తన తండ్రి కోల్పోయిన రాజ్యాన్ని తిరిగి సంపాదించటానికే నిశ్చయించుకున్నాడు. అతనిలో రాజ్యకాంక్ష ఉన్నది. పైగా అట వికుల మధ్య తిరిగి, భయంకరమైన మృగా లను సయితం ఒంటరిగా వేటాడటంలో లాఘవం సంపాదించాడు; అసాధారణ మైన జవసత్వాలూ, ధైర్యసాహసాలూ అలవరుచుకున్నాడు.

అయితే తన రాజ్యం తనకు తిరిగి రావా లంటే అందుకుగాను దీర్ఘ ప్రయత్నం అవసరమవుతుందని జయమల్లుడికి తెలుసు. తనకు జవసత్వాలూ, ధైర్యసాహసాలూ, గురీ, పరిగెత్తే శక్తీ మొదలైనవి ఉన్నాయి గాని యోధుడి కవసరమైన అస్త్ర విద్య రాదు. వేటలోనూ, కొట్లాటలోనూ జయ మల్లుణ్ణి మించగలవాడుండడు. కాని యుద్ధం దారి వేరు. అందుకు అస్త్ర విద్యా





నైపుణ్యం కావాలి. రాజ్యం కొరకు పోరాడే వాడికి సేన కూడా కావాలి. ఇదంతా సమకూర్చుకోవటానికి చాలా కాలం శ్రమపడాలి.

అందుచేత జయమల్లుడు తన తల్లితో సహా పైతసదేశానికి తిరిగి వచ్చి ఒక చిన్న రాజ్యంలో ప్రవేశించి అక్కడ అస్త్ర విద్య అభ్యసించాడు. తరవాత అతను మరొక రాజ్యానికి వెళ్ళి అక్కడి రాజు వద్ద ఒక సైనికుడుగా చేరి త్వరలోనే మంచి పేరు తెచ్చుకున్నాడు.

కొంత కాలానికి అతని తల్లి కూడా చనిపోయింది. అప్పుడతను తనకు రాజ్యప్రాప్తి కలిగే మార్గాలను గురించి తీవ్రంగా ఆలోచించాడు. ఇంద్రదత్తుణ్ణి యుద్ధంలో ఎదిరించి ఓడించి, తన తండ్రి రాజ్యాన్ని తాను తిరిగి పొందటం అసంభవం. అందుకవసరమైన సేనా, డబ్బూ తాను సంపాదించలేడు.

ఇక మిగిలినది ఒకటే మార్గం—యుక్తి మార్గం. శక్తి వల్ల సాధించ లేనిది యుక్తివల్ల సాధ్యమవుతుంది. కనక జయమల్లుడు పేరు మార్చుకుని ఇంద్రదత్తుడి కొలువులో చేరి, అవకాశం కోసం వేచి ఉండి ఇంద్రదత్తుణ్ణి తెగటార్చి, తాను ఫలానా అని ప్రకటించుకుంటే తనను సేనలూ, ప్రజలూ తమ న్యాయమైన రాజుగా ఆమోదిస్తా యనుకున్నాడు. తాను కష్టపడి సేనను పోగుచేసే అవసరం తప్పిపోతుంది. యుద్ధం అవసరం ఉండదు గనక, తమ తండ్రుల కాలం నాటి ఒప్పందానికి భంగమూ రాదు.

ఈ విధంగా ఆలోచించుకుని జయమల్లుడు తన తండ్రి రాజ్యంలో ప్రవేశించి ఇంద్రదత్తుడి సేవలో చేరాడు. జయమల్లుడు స్ఫురద్రూపి. అతను తనకు గల సమస్త శక్తులనూ ప్రదర్శించి చూపాడు. ఇంద్రదత్తుడూ కుర్రవాణ్ణి చూసి చాలా ముచ్చటపడ్డాడు; అతన్ని తన అంగరక్షకుల్లో ఒకణ్ణిగా పెట్టుకున్నాడు.

జయమల్లుడు దేశంలోని పరిస్థితిని శ్రద్ధగా పరిశీలించాడు. ఇంద్రదత్తుడు పరిపాలనలో కఠినుడే అయినా, స్వభావంచేత క్రూరుడుకాడు. ఆయన కొలువులో ఆయన కోసం ప్రాణాలర్పించటానికి సిద్ధంగా ఉన్న వాళ్ళెందరో ఉన్నారు. ఆయన పేరు చెబితే దుర్మార్గులకు సింహస్వప్నం. ప్రజలకు ఎలాటి ఈతి భయాలూ లేవు. తన తండ్రి పరిపాలిస్తూ ఉండిన కాలంలో ప్రజలు అనేక రకాల భయాలకు లోనైనట్టు విని జయమల్లుడు చాలా బాధపడ్డాడు.

ఇంద్రదత్తుడు తరుచు వేటకు వెళ్ళేవాడు. వేటలో జయమల్లుడి అసాధారణ శక్తులు ఇంద్రదత్తుడికి మరింత కొట్టవచ్చినట్టు కనబడ్డాయి. ఘాతుక మృగాలను కూడా జయమల్లుడు మూరెడు కర్ర తప్ప మరో ఆయుధం లేకుండా ఎదుర్కొవటం ఇంద్రదత్తుడు కళ్ళారా చూసి విభ్రాంతుడయాడు. భయమూ, దిగ్భ్రమా జయమల్లుడిలో మచ్చుకైనా లేవు. అది చూసిన తరవాత ఇంద్రదత్తుడు జయమల్లుడు వెంట లేకుండా వేటకు బయలుదేరి ఎరగడు.

ఒకసారి ఇంద్రదత్తుడు వేటకు బయలుదేరాడు. వేట తమకంలో రాజు తన పరివారాన్ని వెనక పడనిచ్చి చాలా దూరం వెళ్ళి పోయాడు. చివరకాయన వెనక్కు



తిరిగి చూసేసరికి జయమల్లు డొక్కడే తనను వెన్నంటి వస్తూ ఉండటం రాజుకు కనిపించింది.

ఇంద్రదత్తుడు ఒక చెట్టు నీడన గుర్రాన్ని దిగి అక్కడ కాస్సేపు విశ్రమించి బడలిక తీర్చుకుందా మనుకున్నాడు. కాని తల కింద ఎత్తులేదు. ఆయన ఉద్దేశం గ్రహించి జయమల్లుడు తన తొడపైన రాజు తల పెట్టుకుని పడుకోనిచ్చాడు. పడుకున్న మరు క్షణమే రాజుకు మంచి నిద్ర పట్టింది.

తన శత్రువును హతమార్చటానికి జయ మల్లుడికి మంచి అవకాశం దొరికింది. తన మొలనున్న బాకు తీసి రాజు గుండెల్లో పొడి చెయ్యటానికి ఒక్క క్షణం పట్టదు. అలా చేద్దామన్న కోరిక కూడా అతనిలో చాలా తీవ్రంగానే కలిగింది. అయినా జయమల్లుడు దాన్ని అణచిపెట్టాడు.

అంతలోనే ఇంద్రదత్తుడు, "పట్టుకోండి! పట్టుకోండి!" అంటూ కంగారుగా నిద్ర నుంచి లేచి కూర్చున్నాడు. ఆయన జయ మల్లుణ్ణి చూసి కొంత శాంతించి, "నీవేనా? నా కొక పీడ కల వచ్చింది. నేను ఇలాగే వీరమల్లుడి కొడుకు తొడపైన తల పెట్టుకుని పడుకున్నానుట. వాడు నన్ను చూసి గుడ్లు రుముతూ, నా తండ్రి రాజ్యం కాజేస్తావా అంటూ తన బాకు ఎత్తి నన్ను గుండెల్లో



పొడవబోయాడుట. నేను అదిరిపడి వెర్రిగా కేకలు పెట్టాను. ఇంతలో మెలకువ వచ్చింది," అన్నాడు.

రాజు పెట్టిన కేకలు ఆయనను వెతుక్కుంటూ వస్తున్న పరివారానికి వినిపించాయి. వాళ్ళు కేకలు వినిపించిన దిక్కుగా పరిగెత్తుకుంటూ రాసాగారు.

"మహారాజా, మీకు వచ్చిన కల బొత్తిగా అబద్ధంకాదు. నేను వీరమల్లుడి కొడుకునే. మిమ్మల్ని చంపాలన్న కోరిక నాలో తల ఎత్తిన మాట కూడా నిజమే. దాన్ని అతి కష్టంమీద అణచిపెట్టుకున్నాను," అన్నాడు జయమల్లుడు.

ఇంద్రదత్తు ఈ మాటలు విని నిర్ఘాంతపోయి, "ఎందుకు నన్ను చంపావుకావు?" అని అడిగాడు.

జయమల్లు డా ప్రశ్నకు సమాధానం చెప్పక, "ఇలాటి పరిస్థితి మరొకసారైనా కలగవచ్చు. అందుచేత నన్ను అంగరక్షకుడుగా పెట్టుకోవటం మీకు క్షేమంకాదు. నాకు సెలవిప్పించండి," అన్నాడు.

దానికి ఇంద్రదత్తు డేమీ సమాధానం చెప్పక, తన పరివారం సమీపానికి రాగానే, "ఇతన్ని బంధించండి!" అన్నాడు.

ఒక్క బాకు మాత్రమే ఉండి కూడా జయమల్లుడు తనను చుట్టు ముట్టిన భటు



లతో హోరాహోరి పోరాడి, అందరినీ గాయపరిచి, తను కూడా గాయపడి, చివరకు వారికి చిక్కిపోయాడు.

ఇంద్రదత్తు డతన్ని రాజధానికి పట్టుకుపోయి, అతని గాయాలకు చికిత్స చేయించి, కొద్ది రోజుల అనంతరం అతన్ని వీరమల్లుడి పూర్వపు రాజ్యానికి రాజుగా, తానే స్వయంగా అభిషేకించి తన పూర్వ రాజ్యానికి తిరిగి వెళ్ళిపోయాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నాకు రెండు సందేహాలు. జయమల్లుడు ఇంద్రదత్తుణ్ణి చంపక పోవటానికి కారణ మేమిటి? భయమా? రాజభక్తా? లేక తమ తండ్రుల నాటి ఒప్పందం మీద గౌరవమా? ఇంద్రదత్తుడు వీరమల్లుడి రాజ్యాన్ని జయమల్లుడి కెందుకు తిరిగి ఇచ్చాడు? అతని వల్ల తనకు ప్రమాదం ఉన్నదని భయమా? లేక తనను చంపకుండా వదిలిపెట్టినందుకు అతడిపైన కృతజ్ఞతా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఇంద్రదత్తుడు ప్రజారంజకుడూ, ప్రజల హితం గోరి రాజ్యం చేసేవాడూ కానట్టయితే జయమల్లు డతన్ని నిశ్చయంగా చంపి ఉండేవాడు. తన తండ్రి ప్రజారంజకంగా పరిపాలించలేదు. అటువంటి పరిస్థితిలో తాను ఇంద్రదత్తుణ్ణి చంపటం వల్ల ప్రజలు తనను చూసి హర్షించరు, తన పక్షంకారు. అందుకే అతను రాజును చంపలేదు. జయమల్లు లాటి శౌర్యపరాక్రమాలూ, ఆత్మ నిగ్రహమూ కలవాడు పరిపాలనలో సమర్థుడవుతాడు. అతని పరిపాలనలో అరాజకం తల ఎత్తదు. ఆ ధైర్యంతోనే ఇంద్రదత్తు డతనికి తండ్రి రాజ్యం ఇచ్చేశాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# కరువు కాటకాలు

ఒకసారి పాపన్న నివసించే దేశంలో పెద్ద కరువు ఏర్పడింది. వానలు కురవలేదు. పంటలు పండలేదు. కరువు నివారణ కోసమై రాజుగారు బావులను మరింత లోతుగా తవ్వించాడు. అందువల్ల లాభం లేకపోయింది. బొక్కసంలో ధనం ఉన్న మేరకు దూరదేశాల నుంచి ఆహార ధాన్యాలు తెప్పించి ప్రజలకు పంచి పెట్టించాడు. బొక్కసం కూడా ఖాళీ అయింది.

ఈ సమయంలో ఒకనాటి తెల్లవారు జామున పాపన్న కొక చిత్రమైన కల వచ్చింది. అందులో పాపన్నకు రాజుగారు కనిపించి, తూర్పుగా కనబడే కొండలను చూపిస్తూ, "ఆ కొండలలో ఎక్కడో ధన రాసులున్నాయని మా కులదేవత చెప్పింది. ఆ ధనం గురించి తెలుసుకు రమ్మని భటులను పంపితే ఒక్కరూ తిరిగి రాలేదు. ప్రజలు మాడి చస్తూంటే ఏమీ చెయ్యలేకుండా చూస్తూ కూర్చోవటం బాధగా ఉన్నది. ఆ ధనం సంగతి తెలుసుకుని వచ్చే వారెవరూ కనిపించరు. కాస్త నీవా పని చేస్తావా?" అని అడిగాడు.

"అంతకంటేనా, ప్రభూ. ఇప్పుడే బయలుదేరుతాను," అని పాపన్న అంటుండగా పాపన్నకు మెలకువ వచ్చింది.

తనకు వచ్చిన కలను తలుచుకుని పాపన్న చాలా ఆశ్చర్యపడ్డాడు. అది ఇంకా కళ్ళకు కట్టినట్టే ఉన్నది. పాపన్న రాజు వద్దకు వెళ్ళి స్వప్న వృత్తాంతం చెబుదామనుకున్నాడు గాని, కల వాస్తవమో, కాదో ముందుగా తేల్చుకోవటం మంచిదని అతనికి అనిపించింది.

అందుచేత పాపన్న ఎవరికీ చెప్పకుండా ఇంటి నుంచి బయలుదేరి తూర్పుగా ప్రయాణమయాడు. అతను తూర్పు కొండల ఇవతల అరణ్యప్రదేశం కుండా పోయే



టప్పుడు అక్కడ గ్రామాలలో నివసించే వారు, ఆ కొండలలోకి ఎవరూ వెళ్ళరనీ, వెళ్ళిన వారెవరూ తిరిగిరారనీ, ఒకప్పుడు కొందరు రాజభటులు అటుగా వెళ్ళి మరి తిరిగి రాలేదనీ చెప్పారు. ఈ మాటలు విన్న మీదట పాపన్నకు తన కలలో కొంత నిజం ఉన్నట్టే తోచి, ముందుకు వెళ్ళాలనే నిశ్చయం మరింత దృఢమయింది.

ముందుకు పోతున్న కొద్దీ అరణ్యం కీకారణ్యమయింది. అటువంటి ప్రాంతంలో నడుస్తూండగా, హఠాత్తుగా ఒక మనిషి పాపన్న దారిలో అడ్డంగా ప్రత్యక్షమై, "మీరా, పాపన్నగారూ? ఇంకెవరో అనుకున్నాను. ఏమిటిలా అరణ్యంలోకి వస్తున్నారు?" అని అడిగాడు.

పాపన్న ఆ మనిషిని గుర్తు పట్టాడు. ఆ మనిషి ఒక దొంగ; లోగడ పాపన్న ద్వారా చికిత్సపొంది, రక్షించబడిన వాడు. పాపన్న అతనితో తన కల గురించి చెప్పి, "జనం తిండికి అల్లాడిపోతున్నారు. కొండల్లో ఆ ధనం ఎక్కడ ఉన్నదీ వెతకటానికి నువు సహాయం చేస్తావా?" అని అడిగాడు.

"అది సాధ్యమయే పని కాదే! ఇది భయంకరమైన ప్రదేశం. ఇక్కడి కెవరూ రాకూడదు. నా పైన దయ వుంచి మీరు తిరిగి వెళ్ళండి," అన్నాడా దొంగ.

"ఒక వంక ప్రజలు తిండిలేక కటకట పడుతూంటే, ఇక్కడ ధనం ఉన్నదని తెలిసి ఎలా వెనక్కుపోను?" అని పాపన్న అడిగాడు.

"బాబూ, అలాటి దయాదాక్షిణ్యాలకిక్కడ చోటులేదు. మీరు దయచేసి వెళ్ళిపొండి," అన్నాడు దొంగ.

ఇంతలో మరొక మనిషి ఎటునుంచో వచ్చి, "ఎవడు వీడు? ఇక్కడికేం పని మీద వచ్చాడు? చేతులూ, కాళ్ళూ కట్టి ఈడ్చుకుపోక నిలబడి వీడితో మాట్లాడు

తున్నావేమిటి?" అని దొంగతో అన్నాడు. వాడు కూడా దొంగల ముఠాకు చెందినవాడే.

వాడితో మొదటి దొంగ రహస్యంగా పాపన్న గురించి చెప్పి, "ఏం చేద్దాం?" అని సలహా అడిగాడు.

"మన నాయకుడి దగ్గిరికి తీసుకు పోదాం," అన్నాడు రెండో దొంగ.

ఇద్దరూ కలిసి పాపన్నను దొంగల నాయకుడి వద్దకు తీసుకుపోయారు. మొదటి దొంగ తమ నాయకుడి చెవిలో రహస్యంగా, పాపన్న ఒకప్పుడు తనకు చేసిన ఉపకారం గురించి చెప్పాడు.




అంతా విని దొంగల నాయకుడు పాపన్నతో, "మా ప్రాంతానికి వచ్చినవాళ్ళను ప్రాణాలతో పోనిచ్చే అలవాటు మాకులేదు. అయినా నీవు మాకు ఉపకారం చేసి ఉన్న వాడివి కనక నిన్ను నిరపాయంగా తిరిగి వెళ్ళిపోనిస్తాను. సరేనా?" అన్నాడు.

"మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి. కాని నాకు ఒక్క ఉపకారం చేయించండి. ఈ కొండలలో ఉండే ధనరాసులు నాకు చూపించినట్టయితే నేను తిరిగివెళ్ళి వాటి వివరాలు రాజుగారితో చెప్పి, ఆ తరవాత జరగవలిసిన ఏర్పాట్లు చేయిస్తాను," అన్నాడు పాపన్న.

"ఇంకా నయం! ఇంతవరకు నీవు చూసినది ఎవరికీ చెప్పనని మా కాళికామ్మ వారి ఎదట ప్రమాణం చేస్తేనే నిన్ను ప్రాణాలతో తిరిగిపోనిచ్చేది," అన్నాడు దొంగల నాయకుడు.

"నాకు చూపటం ఇష్టంలేకపోతే ఇక్కడ ఉండే ధనాన్ని మీరే తిన్నగా రాజుగారి వద్దకు పంపండి," అన్నాడు పాపన్న.

దొంగల నాయకుడు మండిపడి, "మా కష్టార్జితాన్ని మేము ఎవరికీ ఇవ్వము. మా సంగతి ఎవరికీ చెప్పనని కాళిక ముందు ప్రమాణం చెయ్యకపోతే నిన్ను కాళికకు బలి ఇచ్చేస్తాము," అన్నాడు.

"నే నలాటి ప్రమాణం చెయ్యలేను," అన్నాడు పాపన్న.

మరుక్షణమే దొంగలు పాపన్నను చెరొక రెక్క పట్టుకుని కాళికావిగ్రహం వద్దకు తీసుకుపోయారు. అది రెండు నిలువుల ఎత్తుగల భయంకరమైన విగ్రహం.

"ఇప్పుడైనా కాళిక ముందు ప్రమాణం చెయ్యి, ప్రాణాలతో బయట పడతావు," అన్నాడు దొంగల నాయకుడు.

"నే నిక్కడికి డబ్బుకోసం వచ్చాను, మీ రహస్యాన్ని కాపాడటానికి కాదు," అన్నాడు పాపన్న దృఢంగా.

పాపన్న తల తెగయ్యటానికి దొంగల నాయకుడు కత్తి ఎత్తాడు. ఆ క్షణంలోనే కాళికావిగ్రహం, ఎవరో తోసినట్టుగా, మొదలంటా విరుచుకుని, పక్కకు ఒరిగి, దొంగల నాయకుడి పైన పడింది. దొంగల నాయకుడు దాని కిందపడి ఒక్క మూలుగుతో ప్రాణాలు వదిలాడు.

"చూశారా? నన్ను దేవే ఇలా పంపింది. మీ కింక మీ నాయకుడితో పనిలేదని చెప్పటానికి అతణ్ణి బలి పుచ్చుకున్నది. ప్రజలు కరువుబాధ నుండి బయటపడటానికి మీ ధనం అవసరం. ఈ మాట కలలో దేవి చెప్పిన మీదటనే నే నిలా వచ్చాను. నా వెంట రండి. రాజుగారు మిమ్మల్ని శిక్షించకుండా నేను చూస్తాను. మీరంతా మామూలు ప్రజలతో కలిసి జీవించటం ప్రారంభిస్తే దేవి సంతోషిస్తుంది," అని పాపన్న దొంగలకు నచ్చ చెప్పాడు.

పాపన్న ధైర్యం కళ్ళారా చూసిన దొంగలకు అతని మాటలలో సులువుగా గురి కుదిరింది. వాళ్ళు తమ ధన మంతా మోసుకుని రాజుగారి వద్దకు పాపన్న వెంట వెళ్ళారు. రాజుగారు దొంగలందరినీ క్షమించి, వాళ్ళకు జీవనోపాధులు ఏర్పాటు చేసి, వారి ధనంతో కరువు నివారణ యత్నాలు చేశాడు.





# రాజు మెదడు

ఒకప్పుడు దండకారణ్యంలోని వివిధ ప్రాంతాల ప్రజలు ఆటవిక జీవితం గడుపుతూ నాగరికత అన్నది లేకుండా జీవించారు. అయితే ఒక్కొక్క ప్రాంతానికీ ఒక్కొక్క రాజు ఏర్పడి జీవితం క్రమబద్ధమవుతూ వచ్చింది.

ఆ కాలంలో దండాపథమనే ప్రాంతంలో జీవితం అరాజకంగానే ఉంటూ వచ్చింది. బలవంతులు బలహీనులను యధేచ్ఛగా పీడిస్తూ వచ్చారు. ఆ కారణంగా సామాన్య ప్రజలు ఏ పనీ సక్రమంగా కొనసాగించలేక పోయారు. ఎందుకంటే శ్రమ ఫలితం వారికి దక్కేన దాకా నమ్మకం లేదు.

దండాపథంలో సుమిత్రుడనే ఒక బుద్ధిశాలి ఉండేవాడు. తన దేశపు ప్రజల జీవితం దుస్థితిలో ఉండటం అతన్ని ఎంతో బాధించింది. దేశంలోని దుర్మార్గులతో అతను ఎంతగానో చెప్పి చూశాడు, కాని వారు వారి పద్ధతులను మార్చుకో లేదు. చివరకు సుమిత్రుడు ప్రాణం విసిగి అరణ్యానికి వెళ్ళిపోయాడు.

అరణ్యంలో సుమిత్రుడికొక యోగి కనిపించాడు. ఆయన అరణ్యంలోనే ఆశ్రమం నిర్మించుకుని యోగం అభ్యసిస్తున్నాడు.

సుమిత్రుడా యోగి పరిచయం చేసుకుని, దేశంలో అరాజకం పోయి బాగుపడాలంటే ఏం చేయాలి అని అడిగాడు.

"ధైర్య బల పరాక్రమాలూ, వ్యక్తిత్వమూ గల వాణ్ణి ఎన్నుకుని రాజుగా ఏర్పాటు చేసుకుని, జ్ఞానమూ, వివేకమూ, ధర్మబుద్ధీ గల మంత్రిని నియమించినట్టయితే మీ దేశం బాగుపడుతుంది," అని యోగి చెప్పాడు.

సుమిత్రుడు తన దేశానికి తిరిగి వెళ్ళి దేశంలోని బలాఢ్యు లందరిలోకీ బలాఢ్యు

సి. మాధవరావు



డైన ధీరసింహు డనే వాణ్ణి కలుసుకుని, "నీవు రాజుగా ఉండి, సైనిక బలాన్నీ, ధనకోశాన్నీ ఏర్పాటు చేసుకుని, దేశంలోని ప్రతి ఒక్కరినీ శాసిస్తూ పరిపాలన సాగించినట్టయితే మన దేశం బాగుపడుతుంది," అని చెప్పాడు.

ధీరసింహు డిందుకు సంతోషంగా సమ్మతించాడు. తమకు రక్షకుడుగా ఒక రాజు ఉంటాడని విని ప్రజలు కూడా సంతోషించారు. ధీరసింహుడికి రాజ్యాభిషేకం జరిగింది. తన ఆశ్రమం నుంచి యోగి వచ్చి స్వయంగానే రాజ్యాభిషేకం జరిపించాడు. ఆయన వెళ్ళిపోతూ, "బుద్ధిమంతుడైన మంత్రిని ఏర్పాటు చేసుకుని, అతని సలహా ప్రకారం రాజ్యపాలన చెయ్యి," అని ధీరసింహుడికి సలహా ఇచ్చాడు.

అయితే ధీరసింహు డా సలహాను లక్ష్యపెట్టలేదు. "నేను రాజు నైనప్పుడు నాకు మళ్ళీ ఒకరు సలహా ఇవ్వటమేమిటి? పరిపాలన విషయాల్లో మంత్రి చెప్పినట్టు వింటే రాజు మంత్రికి లోకువేగదా," అనుకుని అతను మంత్రి లేకుండానే రాజ్యపాలన సాగించాడు.

పూర్వం విశృంఖలంగా తిరిగిన బలాఢ్యులందరూ ఇప్పుడు రాజు వద్ద కొలువు చేస్తూ, వెనకటిలాగే చిత్తం వచ్చినట్టు ప్రజలను పీడిస్తూ, రాజును మాత్రం సంతోషపెట్టుతూ వచ్చారు. ప్రజలు రాజాజ్ఞకు కట్టుబడి కూడా ప్రయోజనం లేకపోయింది.

సుమిత్రు డీ పరిస్థితి చూసి మరొకసారి యోగి వద్దకు వెళ్ళి పరిస్థితి అంతా చెప్పాడు. అంతా విని యోగి, "మీ రాజును నేను బాగు చేస్తాను. ఒక వారం రోజులకు నేను స్వయంగా వచ్చి మీ రాజును కలుసుకుంటాను. ముందుగా మీరు ఈ పుష్పాన్ని తీసుకుపోయి, నా కానుకగా రాజు కివ్వండి. దీన్ని రాజు తప్ప మరెవరూ ఆఘ్రాణించరాదు, అది అపచార మవుతుంది," అంటూ

సుమిత్రుడి కొక పుష్పాన్ని ఆకులో మడిచి కట్టి ఇచ్చాడు. ఆకు మడతలో నుంచి కూడా దాని సువాసన తెలియవస్తున్నది.

సుమిత్రు డా పుష్పాన్ని తీసుకుపోయి రాజుకిస్తూ, దాన్ని యోగి కానుకగా పంపా డనీ, ఒక వారం గడిచాక ఆయన వచ్చి రాజ దర్శనం చేసుకుంటా డనీ చెప్పాడు. రాజు అలాటి పుష్పాన్ని ఎన్నడూ చూడ లేదు. దాని సువాసన కూడా కొత్తగానే ఉన్నది. అందుచేత అతను దాన్ని పదేపదే వాసన చూశాడు.

మర్నాటి కల్లా రాజుకు తల పోటు ప్రారంభమై, ఆరోజు కారోజు పెరిగి పోయింది. ఎన్ని చికిత్సలు చేసి కూడా ఏమీ ప్రయోజనం లేకపోయింది. రాజు మంచాన పడి యమయాతన అనుభ వించసాగాడు.

అన్న ప్రకారం యోగి వారం రోజులకు వచ్చి రాజును చూశాడు. రాజుకు ఏర్పడిన తల నొప్పి గురించి విని ఆయన, "రాజా, నీకు తల పోటు వచ్చిందంటే రాకేం చేస్తుంది? రాజ్య పాలన అంటే మాటలా? ఈ తల పోటు ఇంకా ముందే వచ్చి ఉండ వలిసింది. నీ మెదడు బలమైనది కనక ఇంత కాలం రాలేదు. ఇకనైనా బుద్ధి



మంతుణ్ణి మంత్రిగా పెట్టుకుని, ఆలోచించే పని అతనికి వదిలేసి, అతని ఆలోచన ప్రకారం నీవు రాజ్యపాలన సాగించు," అని సలహాయిచ్చాడు.

అంత బాధలోనూ ధీరసింహు డీ మాటకు ముఖం చిట్లించుకుని, "ఒకడి సలహాతో నేను రాజ్యం చెయ్యట మేమిటి? అలా జరగటానికి వీలులేదు," అన్నాడు.

యోగి నవ్వి, "మరొకరి బుద్ధికి నిన్ను కట్టుపడి ఉండమని నే నంటానా? తెలివి తేటలు గల వాణ్ణిగా చూసి నీ బుద్ధినే అతడికి అరువిచ్చి, అందరి చేతా పని చేయించు కున్నట్టే అతని చేత కూడా పని చేయిం

చుకో. అలా చేసినట్టయితే నీ కెన్నడూ ఇలాటి తల పోటు రాదు," అన్నాడు.

"నా బుద్ధిని మరొకడికి అరువివ్వటం ఎలా సాధ్యం?" అని రాజు అడిగాడు.

"ఆ ప్రక్రియ నేను చేస్తాను. నీ దృష్టిలో బుద్ధిశాలి ఎవరో చెప్పినట్టయితే నీ మెదడు లోని ఆలోచనా శక్తి కొంత అతడికి పంపకం చేస్తాను," అన్నాడు యోగి.

రాజు సుమిత్రుడి పేరు చెప్పాడు. రాజు గారి బుద్ధిని స్వీకరించి, ఆలోచనలు చెయ్యటానికి సుమిత్రుడు కూడా సమ్మతించాడు. యోగి తన శక్తి చేత రాజుకు యోగ నిద్ర కలిగించాడు. ఆయన సుమిత్రుడితో, "నే నిచ్చిన పుష్పం వాసన చూడటం చేతనే రాజు కీ శిరోవేదన కలిగింది. ఆయన ఈ నిద్ర నుంచి మేలుకునే సరికి అది పోతుంది. ఇకమీద నీవు మంత్రిగా ఉండి రాజు చేత ధర్మప్రకారం రాజ్యపాలన చేయించు," అని చెప్పాడు.

రాజు నిద్ర నుంచి లేస్తూనే తన తల పోటు పోయిందని తెలుసుకున్నాడు.

"ఇప్పుడు నాకు చాలా సుఖంగా ఉన్నది," అన్నాడాయన యోగితో.

"అవును. రాజ్య సంబంధమైన ఆలోచనలు చేసి చేసి నీ మెదడు వాచిపోయింది. అందులో కొంత భాగం సుమిత్రుడికి చెందే టట్టు చేశాను. ఇక నుంచీ నీకు పరిపాలన గురించి ఆలోచించే శ్రమ ఏమీవుండదు. ఆ బాధ అంతా సుమిత్రుడే పడతాడు," అన్నాడు యోగి.

ధీరసింహుడు సుమిత్రుణ్ణి మంత్రిగా నియమించి, అతని సలహాల ననుసరించి రాజ్యపాలన సాగించాడు. బుద్ధిలో మంత్రి రాజుతో సమానుడు గనక రాజుగారి కొలువులో ఉండే అధికారు లందరికీ పైవాడయాడు. అందుచేత పదవులలో ఉన్న దుష్టు లందరి ఆటా కట్టింది. ప్రజలు సుఖపడి పోయారు.






# పరీక్షా ఫలితం

పూర్వం కేకయదేశంలో వితస్తానదీ తీరాన ప్రజ్ఞామతి అనే రాజొకడుండే వాడు. ఆయన వద్ద జాగీరులు పొందిన వారిలో ధర్మపాలు డనే మహావీరు డొకడుండే వాడు. ధర్మపాలుడు అకాలమరణం పొందటం చేత అతని కొడుకైన శూరపాలుడు తన పన్నెండవ ఏటనే జాగీరుకు వారసుడయాడు. శూరపాలుడు చిన్నవాడు కావటం చేతనూ, అతని ఆస్తిని చూసే వారెవరూ లేకపోవటం చేతనూ అతని జాగీరు నుంచి కొన్ని సంవత్సరాల పాటు రాజుగారికి కప్పం వెళ్ళలేదు.

ఏడెనిమిదేళ్ళుగా ధర్మపాలుడి జాగీరు నుంచి కప్పం చెల్లుబడి కావటంలేదని తెలియగానే రాజు శూరపాలుడికి కబురు చేశాడు. ఒక నెల గడువులోగా శూరపాలుడు రాజుగారి దర్శనం చేసుకోని పక్షంలో జాగీరు మరొకరి పరమవుతుందని వార్త రాగానే శూరపాలుడు తన స్నేహితుడైన క్షేమవర్మ అనే వాణ్ణీ, ఇరవైమంది పరివారాన్నీ వెంటపెట్టుకుని రాజధానికి బయలుదేరాడు.

శూరపాలుడు అనుభవించే జాగీరు సుక్షేత్రం. అందులో బంగారం పండటమే గాక, సమస్తమైన ప్రకృతి సంపదలూ కలిగినటువంటిది. ఈ సంగతి తెలిసి రాజుగారి చిన్నకొడుకు ఒక దుర్మార్గపు ఆలోచన చేశాడు. శూరపాలుణ్ణి ఎలాగైనా దారిలోనే కడతేర్చినట్టయితే అతను వచ్చి రాజదర్శనం చేసుకోలేడు. అతను తన ఆజ్ఞను ఉల్లంఘించా డనుకుని రాజుగారు అతని జాగీరును లాగేసుకుంటాడు. అప్పుడు రాజకుమారుడు తండ్రిని లాలించి దాన్ని తానే కాజేయవచ్చు.

ఈ దుర్మార్గపు ఆలోచనను తన మిత్రుడైన మంత్రి కొడుక్కు కూడా చెప్పి

జి. అప్పారావు



ఒప్పించి, అతన్నీ, కొందరు సైనికులనూ వెంటబెట్టుకుని, రాజధానికి ఒక ఆమడ దూరంలో, శూరపాలుడు వచ్చే దారిలో, అరణ్యం మధ్య మాటువేసి ఉన్నాడు. సైనికులను చెట్లచాటున దాచి, రాజు కొడుకూ, మంత్రి కొడుకూ కత్తులు ధరించి, గుర్రాలెక్కి దారికి అడ్డంగా నిలబడ్డారు.

గుర్రాలనూ, యోధులనూ అంతదూరానే చూసి క్షేమవర్మ అందులో ఏదో మోసం ఉన్నట్టు శంకించి, శూరపాలుణ్ణీ, పరివారాన్నీ వెనకనే ఉండమని హెచ్చరించి, తాను ఒక్కడే గుర్రాన్ని నడిపించుకుంటూ ముందుకు వచ్చాడు.

అతనే శూరపాలుడై ఉంటాడనుకుని రాజుకొడుకు అతని దారిని అటకాయించి, "కాస్త గుర్రం కట్టెయ్యి," అన్నాడు.

"దారి ఇయ్యి, నేను వెళ్ళాలి," అంటూ క్షేమవర్మ రాజకుమారుణ్ణి తోసుకుని ముందుకు పోవ యత్నించాడు.

"అంత మదమా?" అంటూ రాజకుమారు డతన్ని గుర్రం మీది నుంచి కిందికి ఒక్క తోపు తోసేశాడు.

మరుక్షణమే శూరపాలుడు అతివేగంతో తన గుర్రాన్ని పరిగెత్తించు కుంటూ వచ్చి, "నిరాయుధుడి పై చెయ్యి చేసుకుంటావా? సిగ్గు లేదూ?" అని రాజకుమారుణ్ణి అడిగాడు.

"ముందు నీ గతి నువు చూసుకో," అంటూ రాజకుమారుడు శూరపాలుడి పైన కత్తి ఎత్తాడు. శూరపాలుడి కత్తి మెరుపులాగా పైకివచ్చి రాజకుమారుడి కంఠాన్ని రెప్పపాటులో నరికేసింది. శూరపాలుడు అసాధారణ యోధుడన్న విషయం రాజకుమారుడికి తెలియదు.

ఈ సంఘటన చూసి మంత్రికొడుకు కొయ్యబారి పోయాడు. చెట్లచాటున దాగిన సైనికులు కుక్కిన పేలలాగా అక్కడే ఉండిపోయారు.

శూరపాలుడు తన మిత్రుడైన క్షేమ వర్మను లేవదీసి గుర్రం మీద ఎక్కించి, తన పరివారాన్ని కేకవేసి, తిన్నగా రాజ ధానికి వెళ్ళాడు. అతను రాజదర్శనం చేసుకుని, "తమ రాజధానికి ఒక ఆమడ దూరంలో బందిపోటులు విశృంఖలంగా తిరుగుతున్నారు. ఒక ధూర్తుడు నన్ను చంప యత్నించాడు, నా మిత్రుణ్ణి అకార ణంగా గుర్రం మీది నుంచి తోసేశాడు. నేను వాడి తల నరికేసి చక్కగా బుద్ధి చెప్పాను," అని రాజుతో అన్నాడు.

"మంచి పని చేశావు! అలాటి వాళ్ళ కదే శిక్ష!" అన్నాడు రాజు.

కాని అంతలోనే మంత్రి కొడుకు రాజ కుమారుడి శవాన్ని తెచ్చి రాజు ముందు పడేసి, "మహారాజా, ఎంత దారుణం జరిగిందో చూడండి. ఈ నీచుడే అరణ్యంలో అబ్బాయిగారి పై అకారణంగా కత్తి దూసి, ఆత్మరక్షణకు కూడా అవకాశ మివ్వకుండా శిరశ్ఛేదం చేసేశాడు," అన్నాడు.

రాజుకు భరించరానంత దుఃఖమూ, కోపమూ కలిగాయి. చనిపోయిన కొడుకంటే రాజుగారికి చాలా ప్రేమ. అందుచేత ఆయన కత్తి దూసి ఆ క్షణంలోనే శూరపాలుడి తల తీయటానికి సిద్ధపడ్డాడు. అయితే రాజుగారి కొలువులో ఉన్నవారంతా తొందరపాటు





తగదనీ, శూరపాలుడేం చెప్పుకుంటాడో అది వినటం కనీస ధర్మమనీ చెబుతూ రాజుగారికి అడ్డు తగిలారు.

"నాకై నేను కయ్యానికి కాలు దువ్వ లేదు. మొదట నా పైన మీ కుమారుడే చెయ్యి చేసుకున్నాడు. అత నెవరో కూడా నాకు తెలియదు. మీ మంత్రి కుమారుడు వచ్చి అబద్ధం చెబుతున్నాడు. మీ దర్శనం కోసం వస్తున్నవాణ్ణి దారిలో కొట్లాటలు పెట్టుకోవటం వల్ల నాకేం ప్రయోజనం ఉంటుంది?" అని శూరపాలుడు చెప్పాడు.

కాని క్రోధంతో వూగిపోతున్న రాజు చెవికి ఈ మాట లేమీ ఎక్కలేదు.

"నువే అబద్ధమాడుతున్నావో, మంత్రి కొడుకే అబద్ధ మాడుతున్నాడో మా కెలా తెలుస్తుంది? ఇది దేవుడే తేల్చాలి. మీ ఇద్దరూ ద్వంద్వ యుద్ధం చెయ్యండి. ఎవరు జయిస్తే వారిది నిజమని ఒప్పుకుంటాను," అన్నాడు రాజు.

శూరపాలుడు గట్టిగా ఇరవై ఏళ్ళు నిండని పసివాడు. మంత్రికొడుకు ముప్ఫై ఏళ్ళవాడు, దృఢకాయుడు. అతని చేతిలో శూరపాలుడు నిశ్చయంగా చచ్చిపోతాడనీ, తన కొడుకు చావుకు ప్రతిక్రియ ఈవిధంగా జరిగిపోతుందనీ రాజు ఆశించాడు. అయితే శూరపాలుడి వేగంలో మంత్రి కొడుక్కు సగం కూడా లేదు. ఇద్దరూ కత్తులు దూసి కలియబడిన కొద్ది క్షణాలలో మంత్రికొడుకు కూడా రాజు కొడుకును చేరుకున్నాడు.

"మహారాజా, ఇంతటితోనైనా ఈ విషయాన్ని వదిలిపెట్టండి. మీ రన్న మాట ప్రకారం ఈ కుర్రవాడు నిరపరాధి అని తేలిపోయింది," అన్నారు మంత్రులు.

కాని రాజుకు శూరపాలుడిపై కసి జాస్తి అయిందే గాని తగ్గలేదు. అతణ్ణి హత మార్చటానికి ఆయన మరొక ఎత్తు వేశాడు.

"నే నితన్ని క్షమిస్తాను. కాని ముందుగా ఇతను నేను చెప్పిన పని ఒకటి

చేసుకురావాలి : ఇతను కుషాను చక్రవర్తి ఆస్థానానికి వెళ్ళి, అతని ఆస్థానంలో ముఖ్య అతిథిగా ఉన్న వ్యక్తిని చంపేసి, చక్రవర్తి కిరీటం తెచ్చి నా కివ్వాలి. ఈ పని చేసి నట్టయితే ఇతన్ని క్షమించటానికి నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు రాజు, తన దురుద్దేశం అందరికీ తెలిసేలాగా.

మిగతా వారంతా నిర్ఘాంతపోయి చూస్తూం డగా శూరపాలుడు, "తమ సెలవైతే అలాగే చేస్తాను," అంటూ సభ నుంచి బయటికి వెళ్ళిపోయాడు.

అతను క్షేమవర్మనూ, పరివారాన్నీ రాజ ధానిలోనే పదిలి, కుషాను రాజుండే నగ రానికి ఒంటరిగా ప్రయాణమయాడు. అది చాలా దూర ప్రయాణమే గాక, దుర్ఘటమైన ప్రయాణం కూడానూ. చక్రవర్తి ఉండే నగరానికి పడమటగా ఉండే కొండలోయలో రాక్షసులున్నారు. శూరపాలుడు ఆ లోయల కుండా ప్రయాణం చేస్తూ రాక్షసుల రాజైన తామ్రాక్షుడనే వాడితో పోరాడి, తన లాఘ వంతో వాణ్ణి చంపి, వాడి చేతికి ఉన్న బంగారు దండకడియం తీసుకుని చక్రవర్తి నగరం చేరుకున్నాడు.

శూరపాలుడు వచ్చి చేరే సమయానికి కుషాన నగరం మహావైభవంగా ఉన్నది. ఎందుకంటే ఆ రోజే చక్రవర్తి కుమార్తె





మండలి అనే దానికి పెళ్ళి చేస్తున్నారు. రాజసౌధంలో చక్రవర్తి బంధుమిత్ర పరివారసమేతుడై కొలువు తీరి ఉన్నాడు. చక్రవర్తికి ఒకపక్క ఆయన కుమార్తే, రెండవ పక్క ఆమెను పెళ్ళాడబోయే వాడూ కూర్చుని ఉన్నారు.

శూరపాలుడు తిన్నగా చక్రవర్తి ఎదటికి వెళ్ళి, వంగి నమస్కారం చేసి, "ఇది రాజాజ్ఞ," అంటూ చప్పున కత్తి దూసి, పెళ్ళి కొడుకు తల నరికేశాడు.

అతిథులు హాహాకారాలు చేశారు. చక్రవర్తి నోట కొంతసేపు మాట రాలేదు. రాజభవన మంతా గగ్గోలెత్తిపోయే ఆ క్షణంలో మండలి ఒక్కతె మాత్రం తృప్తిగా ఒక్క నిట్టూర్పు విడిచింది. ఎందుకంటే ఆమెకు ఆ వరుణ్ణి పెళ్ళాడటం ఎంత మాత్రమూ ఇష్టం లేదు. వాడు పరమకిరాతకుడు, మానవత్వం ఏ మాత్రమూ లేని కర్కోటకుడు.

"ఈ దుర్మార్గుణ్ణి పట్టుకోండి," అని చక్రవర్తి చివరకు కేకపెట్టాడు.

"మహారాజా, మన్నించాలి. నేను మీకు కీడుకోరి వచ్చినవాణ్ణి కాను. మా రాజుగారి ఆజ్ఞ పాలిస్తున్నాను, అంతే! మీ కిరీటం కూడా ఇచ్చేశారంటే నేను వచ్చిన పని తీరిపోతుంది. నా దారిన నేను వెళ్ళిపోతాను. మీకు నా ముఖం మరి చూపించను," అన్నాడు శూరపాలుడు వినయంగా.

ఈ మాటలకు చక్రవర్తి శాంతించక పోగా మరింత మతిపోయిన వాడల్లే అయిపోయి, "ఈ వెర్రివాణ్ణి వెంటనే తీసుకుపోయి చీకటికొట్టులో వేసి, ఆకలిదప్పులతో చావ నివ్వండి!" అని రంకెలు పెట్టాడు.

"నన్ను సామాన్యుడి కింద కట్టెయ్యకండి. నేను తామ్రాక్షుడనే రాక్షసరాజును చంపిన వాణ్ణి. ఇదుగో అతని శవం నుంచి నేను తీసుకొచ్చిన దండకడియం!" అన్నాడు శూరపాలుడు. అది కూడా చక్రవర్తి వినిపించుకోలేదు.



చక్రవర్తి ఆజ్ఞప్రకారం ఆయన భృత్యులు శూరపాలుణ్ణి చుట్టుముట్టి పట్టుకుని, తీసుకుపోయి చీకటికొట్టులో పడేసి తాళం పెట్టేశారు.

ఆ రోజూ, మర్నాడు పగలూ గడిచింది. శూరపాలుడు తిండీ, నీరూ కూడా లేకుండా గాఢాంధకారంలో కటిక నేలపై పడుకుని, "ఇక నాకు ఈ లోకంతో ఋణం తీరిపోయినట్టే. తన కొడుకును చంపినందుకు ప్రజ్ఞామతి మహారాజు నా పైన బాగానే పగ తీర్చుకున్నాడు," అనుకున్నాడు.

అయితే ఉన్నట్టుండి ఆ అంధకారంలో ఆశారేఖ లాగా వెలుగు ప్రవేశించింది. ఎవరో దీపం పట్టుకుని అతనున్న చీకటికొట్టులోకి వచ్చారు. ఆ దీపం వెలుగులో శూరపాలుడు చక్రవర్తి కుమార్తెను, మండలిని గుర్తించాడు.

"నీకు భోజనమూ, నీరూ తెచ్చాను, తీసుకో. కారాగృహాధికారికి లంచం పెట్టి మన పక్షం చేసుకున్నాను. అతన్ని నమ్మవచ్చు," అన్నది మండలి శూరపాలుడితో.

అది మొదలు మండలి ప్రతిరాత్రీ అతనికి భోజనమూ, నీరూ తెచ్చిపెడుతూ వచ్చింది. ఇద్దరూ మాట్లాడుకునే వారు. తనను ఒక కిరాతకుడికి భార్య కాకుండా కాపాడినందుకు చక్రవర్తి కూతురు కృతజ్ఞత తెలుపుకున్నది; చీకటికొట్టులో తిండికీ, దప్పికీ మాడి చావకుండా కాపాడుతున్నందుకు శూరపాలుడు కృతజ్ఞత తెలుపుకున్నాడు. కాని చీకటికొట్టులో నుంచి బయటికి పోయే మార్గమేదో అతనికీ తెలియలేదు, ఆమెకూ తెలియలేదు.

ఒక నెల రోజులు గడవనిచ్చి కారాగృహాధికారి చక్రవర్తి వద్దకు వెళ్ళి, "మహాప్రభూ, వెర్రివాడు మరణించాడు," అని విన్నవించాడు.

"పీడ వదిలిపోయింది," అన్నాడు చక్రవర్తి సంతోషంగా.

ఇది జరిగిన కొద్దిరోజులకే చక్రవర్తికి పెద్ద ప్రమాదం వచ్చిపడింది. శూరపాలుడి చేతిలో చచ్చిన తామ్రాక్షుడి తమ్ముడు ధూమ్రాక్షుడనే రాక్షసుడు చక్రవర్తి పైకి వస్తున్నట్టు తెలిసింది.

చక్రవర్తి కంగారు పడిపోయాడు. రాక్షసులతో కయ్యం పెట్టుకుంటే అది ఎక్కడికి దారి తీసేదీ తెలియదు.

"తామ్రాక్షుణ్ణి చంపిన కుర్రవాడే ఉంటే ఈ ధూమ్రాక్షుడి సంగతి తేల్చును," అన్నది మండలి తండ్రితో.

"నిజమే, కాని వాడు చీకటికొట్టులో తిండికి మాడి మాడి చచ్చాడు గద!" అన్నాడు చక్రవర్తి.

మండలి తండ్రి కాళ్ళపై పడి ముందుగానే క్షమాపణ చెప్పుకుని, "అతను చావలేదు. నే నతనికి రోజూ భోజనం పంపుతూనే ఉన్నాను. అతన్ని చెర విడిపించినట్టయితే ఈ ధూమ్రాక్షుడితో పోట్లాడుతాడు," అన్నది.

చక్రవర్తికి ప్రాణం లేచి వచ్చింది. రాక్షసులు విచిత్రమైన వాళ్ళు. తమలో ఏ ఒకడైనా మరొకడితో పోరి చచ్చిపోతే వారు పట్టించుకోరు. ఒక్క రాక్షసుడి పైకి సేనను పంపి చంపినట్టయితే లోయలో ఉండే



రాక్షసులంతా వచ్చిపడి రాజ్యాన్నీ, రాజధానినీ మట్టుపెట్టేస్తారు.

చక్రవర్తి తక్షణమే కారాగృహానికి మనిషిని పంపి, శూరపాలుణ్ణి పిలిపించి, "నీ చేత చచ్చిన రాక్షసుడి తమ్ముడు మన పైకి వస్తున్నాడు. నీవు వెళ్ళి వాడితో యుద్ధం చేసి జయిస్తివా, నీకు నా కిరీటమే కాదు, నా కూతుర్ని ఇచ్చి వివాహం కూడా చేస్తాను," అన్నాడు.

"అందుకు నేను సిద్ధమే," అన్నాడు శూరపాలుడు.

అతను వెళ్ళి ధూమ్రాక్షుడితో పోరాడాడు. వాడు తన గద ఎత్తి నెత్తి మీద

పెట్టెలోపల శూరపాలుడు వాడి గుండెను తన కత్తితో చీల్చేసి చంపేశాడు.

శూరపాలుడు చక్రవర్తి వద్దకు తిరిగి వచ్చి, "మీ పని పూర్తి చేశాను, మీ రిచ్చిన వాగ్దానం నిలబెట్టుకోండి," అన్నాడు.

"సరే నిన్ను ప్రాణాలతో వదిలేస్తున్నాను, వెళ్ళి పో!" అన్నాడు చక్రవర్తి, రాక్షస భయం తీరిపోయిన బింకంలో.

"నాకు మీ కిరీటం ఇస్తా నన్నారు. మీ అమ్మాయి నిచ్చి పెళ్ళిచేస్తా నన్నారు," అన్నాడు శూరపాలుడు.

"తక్షణం వెళ్ళిపోకపోతే నిన్ను మళ్ళీ చీకటికొట్టుకు పంపగలను జాగ్రత్త! ఒళ్ళు తెలిసి మాట్లాడు!" అన్నాడు చక్రవర్తి.

శూరపాలుడికి పట్టరాని క్రోధం వచ్చింది. అతను మెరుపులాగా కత్తి దూసి చక్రవర్తి తల నరికేశాడు.

రాజోద్యోగులు శూరపాలుణ్ణి శిక్షించా లనుకున్నారు. కాని చక్రవర్తి చావగానే ఆయన స్థానంలో చక్రవర్తిని అయిన మండలి, "ఇతను నిరపరాధి. పైపెచ్చు నాకు కాబోయే భర్త. మీరందరూ ఇతనికి విధేయులై ఉండాలి," అన్నది.

శూరపాలుడు మండలిని వివాహం చేసుకుని రాజ్యాభిషేకం కూడా జరిపించుకున్నాడు. ఆ సమయంలో అందరు రాజులతో బాటు కేకయదేశంలోని ప్రజ్ఞామతి కూడా వచ్చి కొత్త చక్రవర్తికి జోహర్లు అర్పించుకున్నాడు.

"ఏం మహారాజా, మీరు చెప్పిన రెండు పనులూ చేశాను. చక్రవర్తి కిరీటం ఇప్పుడు నా నెత్తినే ఉన్నది. ఏమంటారు?" అని శూరపాలుడు ప్రజ్ఞామతిని అడిగాడు.

ప్రజ్ఞామతి వణికిపోతూ అతని కాళ్ళపైన పడి, క్షమించమని ప్రాధేయపడ్డాడు.

"ఈసారికి క్షమిస్తున్నాను. ఇంక ఎప్పుడూ ఎవరికీ అనాలోచనగా పరీక్షలు పెట్టకండి," అన్నాడు శూరపాలుడు.





# ఏడు గుర్రాలు

చాలా కాలం క్రితం ఒక అరణ్యానికి సమీపంలో ఒక పేద కుటుంబం నివసిస్తూ ఉండేది. భార్యా, భర్తా, ఇద్దరు కొడుకులూ ఎంతగా ఒళ్ళు విరుచుకుని శ్రమపడినా కడుపు నిండా తిండే ఉండేదికాదు. బట్టల మాట చెప్పనే అవసరంలేదు.

"ఛీ, ఈ బతుకు బతికే కన్న ఊళ్ళ వెంబడి తిరిగి అడుక్కు తినటం మేలు," అని పెద్ద కొడుకు ఒకనాడు తూర్పు తెల్లవారుతుండగా బయలుదేరి కను చీకటి పడే దాకా నడిచి ఒక రాజభవనం చేరుకున్నాడు.

భవనం ముందు మెట్ల మీద స్వయంగా నిలబడి ఉన్న రాజు వాణ్ణి చూసి, "ఎవరు నువు? ఎక్కడికి నీ ప్రయాణం?" అని అడిగాడు.

"ఒక చోటి కని లేదు. ఎక్కడ పొట్ట గడిస్తే అక్కడికే!" అన్నాడు పేదవాడి పెద్ద కొడుకు.

"నీకు పని కావాలన్న మాట. నా ఏడు గుర్రాలనూ కాస్తావా? నీకు వేరే జీతం ఇవ్వను. రోజల్లా గుర్రాల వెంట తిరిగి, సాయంకాలం ఇంటికి వచ్చి, గుర్రాలేం తిన్నదీ, ఏం తాగిందీ నాకు చెప్పాలి. నిజం చెప్పావంటే నీకు నా కూతురి నిచ్చి పెళ్ళి చేస్తాను. అబద్ధ మాడినట్టయితే చావగొట్టి పంపేస్తాను," అన్నాడు రాజు.

పేదవాడి పెద్ద కొడుక్కు ఇదే మంత కష్టమైన పనిగా కనిపించలేదు. వాడి కప్పుడే తాను రాజుగారి అల్లుడై పోయినంత ఆనందం కలిగింది. "మీ గుర్రాలను కాయటానికి నన్ను పెట్టుకోండి, మహారాజా!" అన్నాడు వాడు.

మర్నాడు వాడు తూర్పు తెల్లవారుతుండగానే గుర్రపుసాలకు వెళ్ళాడు. కాసా వాడు ఏడు గుర్రాలనూ వదిలిపెట్టాడు. అవి తెల్లని, అందమైన గుర్రపు పిల్లలు;

కె. లక్ష్మణస్వామి




బయటికి వస్తూనే శరవేగంతో బీళ్ళ కేసి పరిగెత్తసాగాయి. పేదవాడి పెద్ద కొడుకు కాలి సత్తువ కొద్దీ వాటి వెనక దౌడుతీశాడు.

గుర్రాలు ఎక్కడా ఆగకుండా కొండల పక్కగా పరిగెత్తసాగాయి. పోయిన కొద్దీ వాటి వేగం హెచ్చిందిగాని తగ్గలేదు. ఎక్కడ చూసినా బోలెడంత పచ్చిక మేత ఉన్నప్పటికీ అవి మేయటానికి ఆగలేదు.

కొండల దాకా వచ్చేసరికి పేదవాడి పెద్ద కొడుకు ఇక పరిగెత్తలేక పోయాడు. వాడి శరీర మంతా చెమటతో తడిసిపోయింది, ఆయాసంతో ఎగరొప్పు వచ్చేసింది, కాళ్ళు తడబడుతున్నాయి.

కొండ కింద ఒక గుడిసెలో కూర్చుని రాట్నం తిప్పుతున్న ఒక ముసలిది, "రా, బాబూ, రా! చెమట తుడుస్తాను," అని వాణ్ణి ప్రేమగా ఆహ్వానించింది. వాడు ఆశ్చర్యపడుతూ ముసలిదాని కేసి చూసి గుర్రాల కోసం చూసేలోపుగా అవి ఎటో వెళ్ళిపోయాయి.

ఇక వాటిని తాను అందుకునే ఆశ లేదని నిశ్చయించుకుని పేదవాడి పెద్దకొడుకు ముసలిదాని గుడిసెలోకి ప్రవేశించాడు.

ముసలిది వాడి ఒంటి మీద చెమటంతా తుడిచి, విసిరి, జుట్టు దువ్వి ఉపచారాలు చేసింది. కాస్త విశ్రాంతి పొందిన మీదట వాడు లేచి నిలబడి, "ఇంక నేను తిన్నగా మా ఇంటికి పోతాను. రాజుగారింటికి వెళ్ళటం వృథా. వెళ్ళితే రాజుగారు గుర్రాలేం తిన్నాయి, ఏం తాగాయని అడుగుతారు. చెప్పలేకపోతే చావగొట్టి పంపేస్తారు. దెబ్బలు కూడా దేనికి?" అన్నాడు.

"ఈ మాత్రానికే భయపడతావేం, బాబూ? గుర్రాలు గడ్డి తిని, నీళ్ళు తాగుతాయి. రాజుతో ఆ మాటే చెప్పు!" అని ముసలిది వాడికి సలహా ఇచ్చింది.

సాయంకాలమై గుర్రాలు తిరిగి వచ్చే దాకా పేదవాడి పెద్ద కొడుకు ముసలిదాని

గుడిసెలోనే ఉండి, వాటి వెనకాలే రాజ భవనానికి వెళ్ళాడు.

వాణ్ణి చూస్తూనే రాజు, "గుర్రాలను జాగ్రత్తగా కాచావా? అవి ఏం తిన్నాయి? ఏం తాగాయి?" అన్నాడు.

"గడ్డి తిని, నీళ్ళు తాగాయి," అన్నాడు పేదవాడి పెద్ద కొడుకు.

"వీణ్ణి పట్టుకు చావ చితకొట్టి పంపించెయ్యండి," అన్నాడు రాజు కోపంగా తన భటులతో.

ముసలిదాని సలహా విన్నందుకు ఒళ్ళంతా హూనం చేయించుకుని పేదవాడి పెద్దకొడుకు సగం ప్రాణంతో ఇంటికి తిరిగి వచ్చాడు.

పెద్దవాడు తిరిగి రాగానే చిన్నవాడు తన పొట్ట తాను పోసుకుంటానని ఇంటి నుంచి బయలుదేరాడు. వాడుకూడా రోజల్లా నడిచి చీకటి పడేవేళకు రాజభవనం చేరుకున్నాడు. రాజు వాణ్ణి తన గుర్రాలు కాయమనీ, అవి ఏం తినేదీ ఏం తాగేదీ చెప్పమనీ, నిజం చెబితే తన కూతురు నిచ్చి పెళ్ళి చేస్తాననీ, అబద్ధం చెబితే చావగొట్టిస్తాననీ అన్నాడు.

అందుకు సిద్ధపడ్డాడు చిన్నవాడు. మర్నాడు తెల్లవారుతుండగానే గుర్రాలను




వదిలారు. అవి పరిగెత్తసాగాయి. చిన్నవాడు వాటి కంటె ముందు పరిగెత్తుతూ, "రండి, నాతో పందెం వేసి పరిగెత్తండి," అని వాటిని ఆహ్వానించాడు.

గుర్రాలు కొండప్రాంతాన్ని చేరేసరి కింకా వాడు పరిగెత్తుతున్నాడు. వాడి ఒళ్ళు చెమటలు దిగకారుతున్నది. అయినా వాడు పరుగు మానలేదు. ఇంతలో వాడు అవ్వ ఉన్న గుడిసెను సమీపించాడు.

"రా, బాబూ, రా! చెమట తుడుస్తాను," అని ముసలిది వాణ్ణి ఆహ్వానించింది.

"నేను నీకు చిక్కినప్పటి మాటగద!" అంటూ వాడు పరుగుతీశాడు.




కాని వాడికి అలుపు వచ్చేస్తున్నది. అప్పటి దాకా వాడు గుర్రాలతో సమంగా పరిగెత్తాడు గాని, గుర్రాలు ఇంక వాణ్ణి దాటి పోయేటట్టు కనిపించాయి. వాడు అన్నిటి కన్న వెనకగా ఉన్న గుర్రం జూలు పట్టుకుని, ఒక్క ఎగురున దాని వీపు మీద ఎక్కి కూర్చున్నాడు.

ఆ గుర్రాలు అలా చాలాదూరం పరిగెత్తి ఒక దట్టమైన అరణ్యం మధ్య ఉన్న ఒక దేవాలయ ప్రాకారం వద్ద నిలిచాయి. అదే వాటి గమ్యస్థానమని గ్రహించి చిన్నవాడు తానెక్కిన గుర్రం మీది నుంచి దిగి, ఆలయ ప్రాంగణం కేసి నడిచాడు.

గుర్రాలు ఒకటొకటిగా ఆలయ ప్రాంగణంలోకి అడుగుపెట్టి అందమైన యువకులుగా మారిపోయాయి.

ఈ వింత పరివర్తన చూస్తూనే చిన్నవాడు నిర్ఘాంతపోయాడు.

ఆ యువకులలో పెద్దవాడు పేదవాడి చిన్న కొడుకును దగ్గిరకు పిలిచి, తమ విషయం ఇలా చెప్పాడు:

"మే మేడుగురమూ రాజుగారి కొడుకులం. మా నాన్న నీ కిచ్చి పెళ్ళి చేస్తానన్నది మా చెల్లెలినే. దారిలో నిన్ను పిలిచిన ముసలితొత్తు మాయలమారిది. అదే తన మంత్రశక్తితో మమ్మల్ని ఇలా మార్చేసింది. దాని మంత్రం ఈ ఆలయం ఆవరణలో పని చేయదు. అందుచేత మేము పగలు సాధ్యమైనంత సేపు ఇక్కడే మనుష్యులంగా ఉంటాం. మనుష్యులు తినే తిండి తింటాం. మనుష్యులు తాగే పానీయాలు తాగుతాం. మే మేమేమి తింటామో, తాగుతామో చూస్తావు గనక, ఆ సంగతి మా నాన్నకు చెప్పగానే ఆయన మా చెల్లెలిని నీ కిచ్చి పెళ్ళి చేస్తాడు. ఆ తరవాత నీ వల్ల మా కొక ఉపకారం కావాలి. ఈ గర్భగుడిలో ఒక కత్తి ఉన్నది. అది మంత్రపూతమైన కత్తి. నీవు దాన్ని

తీసుకుని మాతోబాటు ఇంటికి వచ్చి, రాత్రి మేము గుర్రపుసాలలో కట్టి ఉన్నప్పుడు, ఆ కత్తితో మా తలలు నరికెయ్యి. దానితో మాకీ గుర్రాల రూపం పోయి మనిషిరూపం శాశ్వతంగా వచ్చేస్తుంది.''

ఈ మాటలు చెప్పి పెద్ద రాజకుమారుడు పేదవాడి చిన్నకొడుకును గర్భగుడిలోకి తీసుకుపోయి ఒక మూల ఆనించి ఉన్న కత్తిని చూపాడు. చిన్నవాడు దానిని రెండు చేతులా పట్టుకుని కూడా తేలికగా ఎత్తలేకపోయాడు.

గర్భగుడిలోనే చిన్న గుంట ఉన్నది. అందులో ఉన్నది మంత్రజలమనీ, దాన్ని మూడు గుక్కలు తాగమనీ రాజకుమారుడన్నాడు. చిన్నవాడా నీరు మూడు గుక్కలు తాగి ఒక్క చేత్తోనే కత్తిని పట్టుకుని తేలికగా ఎత్త గలిగాడు.

తరవాత రాజకుమారులు ఆ గుడి ఆవరణలోనే వంట చేసుకున్నారు. వంటకు కావలిసిన సమస్త పదార్థాలూ గుడిలో ఒక పక్క ఉన్నాయి.

రాజకుమారులతో బాటు చిన్నవాడు కూడా భోజనం చేశాడు.

సూర్యాస్తమయం కాబోయేదాకా వారందరూ గుడిలోనే విశ్రాంతి తీసుకుని ఇంటికి బయలుదేరారు. గుడిదాటి బయటికి రాగానే



రాజకుమారులు యథాప్రకారం గుర్రాలుగా మారారు. పేదవాడి చిన్నకొడుకు కత్తితో సహా ఒక గుర్రం పైన ఎక్కాడు.

వాడు గుర్రాలతో తిరిగి వచ్చేటప్పుడు ముసలిది చిన్నవాణ్ణి చూసి కళ్ళ నిప్పులు రాలుస్తూ, వాణ్ణి బెదిరించింది.

చిన్నవాడిల్లు చేరగానే రాజు, "గుర్రాలను సరిగా కాచావా?" అన్నాడు.

"కాస్తానన్న తరవాత కాయకుండా ఉంటానా?" అన్నాడు చిన్నవాడు.

"అవి ఏం తిన్నాయి? ఏం తాగాయి?" అని రాజు మళ్ళీ అడిగాడు.

"మనుషులు తినే తిండే తిన్నాయి, మంత్రజలం తాగాయి," అని జవాబిచ్చాడు చిన్నవాడు.

"ఈ మాట చెప్పగల వాడు ఒక్కడు కూడా లేకపోయె గదరా! అన్నప్రకారం నీకు నా కూతుర్నిచ్చి అల్లుడుగా చేసుకుంటాను," అన్నాడు రాజు.

ఆ రాత్రి అందరూ పడుకున్నాక చిన్నవాడు కత్తి తీసుకుని గుర్రపు సాలలోకి వెళ్ళాడు. కాని గుర్రాల మెడలు నరకాలంటే వాడికి చేతులు రాలేదు. చివరకు సాహసించి ఒక గుర్రం మెడ తెగ నరికాడు. వెంటనే దాని స్థానంలో ఒక రాజకుమారుడు నిలబడ్డాడు. ఆ తరవాత వాడు ధైర్యంగా అన్ని గుర్రాల మెడలూ నరికేశాడు. ఏడుగురు రాజకుమారులూ మంత్ర విముక్తి పొందారు.

తన కొడుకులు తిరిగి పుట్టినట్టుగా రాజు సంతోషించాడు. రాజకుమార్తె ఎంతో కాలానికి తన అన్నలను కళ్ళారా చూసి ఆనంద బాష్పాలు రాల్చింది. ఆమెకూ చిన్నవాడికీ పెళ్ళి నిశ్చయించారు. చిన్నవాడు తన తల్లిదండ్రులనూ, అన్ననూ పిలిపించి వారిని కూడా రాజభవనంలో ఉంచాడు. పెళ్ళి వైభవంగా జరిగింది. అందరూ సుఖంగా ఉన్నారు.





# యుద్ధకాండ

కుంభకర్ణుణ్ణి గురించి విభీషణుడు రాము డితో ఇంకా ఈ విధంగా చెప్పాడు :

కుంభకర్ణుడు పుట్టుతూనే ఆకలివేసి మనుష్యులను వేల సంఖ్యలో తినసాగాడు. ప్రజలు బెదిరిపోయి ఇంద్రుణ్ణి శరణు జొచ్చారు. ఇంద్రుడు అలిగి కుంభకర్ణుడిపై వజ్రాయుధం ప్రయోగించాడు. కుంభ కర్ణుడు ఐరావతం యొక్క దంతాన్ని పెరికి ఇంద్రుణ్ణి రొమ్ములో కొట్టాడు.

ఇంద్రుడు ప్రజలను వెంటబెట్టుకుని బ్రహ్మ దగ్గిరికి వెళ్ళి, కుంభకర్ణుడు ప్రజ లను తింటున్నాడనీ, దేవతలను అవమా నిస్తున్నాడనీ, ఆశ్రమాలను ధ్వంసం చేస్తు న్నాడనీ, పరస్త్రీలను హరిస్తున్నాడనీ బ్రహ్మతో చెప్పాడు.

బ్రహ్మ, రాక్షసుల నందరినీ పిలిపించి, వారిలో కుంభకర్ణుణ్ణి చూశాడు. ఆయన కుంభకర్ణుడితో, "విశ్రవసుడు నిన్ను కన్నది ప్రజాక్షయం చెయ్యటానికిలాగా ఉందే మిరా! ఇది మొదలు నీవు ఒళ్ళు తెలియ కుండా పడి నిద్రపోతూ ఉండు," అన్నాడు.

కుంభకర్ణుడు బ్రహ్మ ఎదటనే నిద్ర ముంచుకొచ్చి పడిపోయాడు. అది చూసి రావణుడు, "తాతా, నీ మునిమనమణ్ణి ఇలా శపించటం అన్యాయం. వీడి నిద్రకూ, మెలకువకూ కాల నియమం ఏర్పాటు చెయ్యి," అన్నాడు.

"వీడు ఆరు మాసాల పాటు నిద్ర పోయి ఒకరోజు మేలుకుని ఉంటాడు," అన్నాడు బ్రహ్మ.



విభీషణుడు రాముడి కీ విషయాలు చెప్పి, "రామా, నీ దెబ్బకు రావణుడు బెదిరిపోయి నిద్రపోతున్న కుంభకర్ణుణ్ణి లేపాడు. అతన్ని చూసే బెదిరి పారిపోయే వానరులు అతనికి యుద్ధంలో ఎదురునిల్చి ఏం పోట్లాడగలరు? అందుచేత వానరులతో మనం ఇదొక నడిచే యంత్రమని చెప్పాలి," అని చెప్పాడు.

రాముడు నీలుడితో వానరసేనను యుద్ధానికి సిద్ధం చెయ్యమని చెప్పాడు. గవాక్షుడూ, శరభుడూ, హనుమంతుడూ, అంగదుడూ తలా ఒక పర్వత శిఖరమూ పట్టుకుని లంకా ద్వారాల వద్ద నిలబడ్డారు.

ఈలోపల కుంభకర్ణుడు రావణుడి ఇంటికి వెళ్ళి, పుష్పకంలో విచారంగా కూర్చుని ఉన్న తన అన్నను చూశాడు. కుంభకర్ణుణ్ణి చూడగానే రావణుడు సంతోషంతో లేచి వెళ్ళి కౌగలించుకున్నాడు.

కుంభకర్ణుడు అన్నగారి పాదాలకు నమస్కారం చేసి, "నన్ను నిద్రలేపిన కారణమేమిటి? ఏం భయం వచ్చిపడింది? ఎవరికి చావు మూడింది?" అని అడిగాడు.

"నీవు చాలా కాలంగా సుఖ నిద్రలో మునిగి ఉన్నందున, రాముడు నాకు తెచ్చి పెట్టిన భయం గురించి నీకు తెలీదు. రాముడు సుగ్రీవుడి సేనతో సహా సముద్రాన్ని దాటి వచ్చి మన అంతు కనుక్కుంటున్నాడు. లంకలో ఉండే వనాలూ, ఉపవనాలూ చూడు; అన్నీ వానర మయం. మన రాక్షస ముఖ్యుల నందరినీ వానరులు చంపేస్తున్నారు, వానర ముఖ్యులు మన చేతిలో చావటం కనబడదు. నువు మహాబలుడివి, ఈ ఆపద నుంచి కాపాడుతావని నిద్రలేపాం," అని రావణుడు కుంభకర్ణుడితో అన్నాడు.

కుంభకర్ణుడు నవ్వాడు.

"వెనక ఈ విషయం చర్చించుకున్నప్పుడు నీ హితం కోరినవారు ఏ ప్రమాదం



వస్తుందని చెప్పారో అదే వచ్చిం దన్న మాట! ముందు వెనకలు ఆలోచించుకోకుండా బల గర్వంతో సీతను అపహరించి తెచ్చావు. మన తమ్ముడు విభీషణుడు చెప్పినట్టు చెయ్యి," అన్నాడు.

రావణు డీ మాటలు విని అలిగి, "నీవు చిన్నవాడివి; నేను పెద్దవాణ్ణి, గౌరవించ దగిన వాణ్ణి. నాకు నీవు బుద్ధులు చెప్పటం వట్టి కంఠ శోష. జరిగిపోయినదాన్ని గురించి ఇప్పుడు చర్చ దేనికి? ప్రస్తుత కర్తవ్యం ఆలోచించు. నేను చేసిన తప్పును నీ శౌర్యంతో సరిదిద్దు," అన్నాడు.

రావణుడికి కోపం వచ్చిందని గ్రహించి కుంభకర్ణుడు మృదువుగానూ, ఊరడింపుగానూ ఇలా అన్నాడు: "బాధపడకు! కోప్పడకు! నీకు తమ్ముణ్ణీ, హితుణ్ణీ కనక నీకు చెప్పవలిసిన మాట చెప్పాను. యుద్ధంలో రామలక్ష్మణులను చంపేసి నీ కోరిక తీరుస్తాను. రాముడి తల తెచ్చి నీ ముందు పెట్టి నిన్ను సంతోష పెడతాను. నేను బతికి ఉండగా నీకు రాముడి భయం ఎందుకుంటుంది? నన్ను యుద్ధానికి పంపించు. నా కసలు ఆయుధాలతో పని లేదు, ఉత్త చేతులతోనే ఎంతటి యోధులనైనా చంపెయ్యగలను."



కుంభకర్ణుడి ఈ మాటలు విని మహోదరుడు మండిపడ్డాడు.

"నీవు మొరటు మనిషివి, అల్ప బుద్ధివి, అహంకారివి! రావణుడు చెయ్యగూడని పని ఎందుకు చేస్తాడు? చెడ్డపని చేసినందు వల్ల దుష్ఫలితం కలిగినట్టు చెప్పావే, అలా అనటానికి ప్రమాణ మేమిటి? మంచి పనుల వల్ల దుఃఖమూ, చెడ్డ పనుల వల్ల సుఖమూ కలగటం లేదా? సీతను అపహరించాలని రావణుడికి కోరిక పుట్టింది. ఆ కోరికను మేముకూడా బలపరిచాం. అది అలా ఉంచు. నీ వొక్కడవే యుద్ధానికి పోతానంటున్నావే! జనస్థానంలో అంత



మనసును వశ్యం చేసుకుంటాడు. రావణుడు యుద్ధానికి వెళ్ళి రాముణ్ణి ఎదుర్కోవలసిన పని లేకుండానే సీత అతని వశమవుతుంది! ఇదీ మహోదరుడు చెప్పిన ఉపాయం.

అంతా విని కుంభకర్ణుడు, "ఇలాటి మాట లెన్నడూ చెప్పకు. ఒళ్ళు జాగ్రత్తగా పెట్టుకో!" అని మహోదరుణ్ణి హెచ్చరించాడు. అతడివంటి వాళ్ళ సలహాలు వినే రావణుడి కీ గతి పట్టిందన్నాడు. యుద్ధం పేరు చెబితేనే భయపడే మహోదరుడి లాటి వాళ్ళు రావణుడు చెప్పినదాని కల్లా తల ఊపుతూ మార్గదర్శకులుగా ఉండటానికి బదులు తోడునీడలుగా తయారైనారన్నాడు.

కుంభకర్ణుడి మాటలకు రావణుడు గట్టిగా నవ్వి, "మహోదరుడికి రాముడంటే భయంలే! అందుచేత యుద్ధానికి పోవద్దంటున్నాడు. నీవు వెళ్ళి యుద్ధం చేసి జయించి రా. వెళ్ళి, రామలక్ష్మణులనూ, వానరులనూ భక్షించు," అన్నాడు.

కుంభకర్ణుడు ఒక అపూర్వమైన శూలాన్ని తీసుకున్నాడు. అది బోలెడంత ఇనుము ఉపయోగించి చేసినది, బంగారు అలంకారాలు గలది, ఎర్రని పూలమాలికలు చుట్టినది, ఇంద్రుడి వజ్రాయుధానికి

మంది రాక్షస వీరులను చంపిన రాముణ్ణి నీ వొక్కడవే చంపగలవా?" అన్నాడు మహోదరుడు.

తానూ, ద్విజిహ్వుడూ, సంహ్రాదీ, కుంభకర్ణుడూ, వితర్దనుడూ అనే అయిదుగురూ వెళ్ళి రాముణ్ణి చంపాలని మహోదరుడు సూచించాడు. రాముడు చచ్చాడా సరే సరి, ఒక వేళ అతను చావకపోయినా ఈ అయిదుగురూ యుద్ధంలో తిన్న గాయాలతో, రక్త ప్రవాహాలతో తిరిగి వచ్చి, రావణుడితో, "మేము రామలక్ష్మణులను తినేశాం!" అని చెబుతారు. అప్పుడు రావణుడు సీతను ఓదార్చి, ధనకనక వస్తువాహనాలిచ్చి ఆమె

తీసిపోనిది. ఆ శూలం మాత్రం తీసుకుని, తాను ఒక్కడే యుద్ధానికి పోతాననీ, తనకు సహాయంగా సేన అవసరంలేదనీ కుంభకర్ణుడు చెప్పాడు.

రావణుడు అతనితో సైన్యాన్ని ఆయుధాలనూ తీసుకుపొమ్మనీ, యుద్ధంలో ఏమరుపాటుగా ఉన్నవాడికీ, ఒంటరిగాడికీ ప్రమాదం హెచ్చనీ అన్నాడు. అతను తన తమ్ముడి మెడలో రత్నఖచితమైన బంగారు హారం వేశాడు, అతనికి బాహుపురులూ, ఉంగరాలూ మొదలైన ఆభరణాలు పెట్టాడు, మంచి సువాసన గల పుష్పమాలలు వేశాడు, చెవులకు కుండలాలు పెట్టాడు, ఎంతో బరువైన బంగారు కవచం తొడిగాడు.

కుంభకర్ణుడు అన్నను కౌగలించుకుని, అతని చుట్టూ ప్రదక్షిణం చేసి, సాష్టాంగ నమస్కారం చేసి యుద్ధానికి బయలు దేరాడు. అతని వెనకగా మహాబలశాలులైన రాక్షసవీరులూ, పెద్దసేనా ఆయుధాలు ధరించి బయలుదేరారు. యుద్ధానికి బయలుదేరేటప్పుడు కుంభకర్ణుడు తన దేహాన్ని అపారంగా పెంచి ఉండటం వల్ల అతను ప్రాకారాల మీదుగా అంగవేసి దాటి వానరసేనలను చేరబోయాడు. అతన్ని



చూసి వానరులు, మహామారుతానికి కొట్టుకుపోయే మబ్బు తునకల్లాగా, అన్ని దిక్కులకూ చెల్లాచెదరుగా పారిపోయారు.

కుంభకర్ణుణ్ణి చూసి పారిపోతున్న వానర వీరులలో నలుడూ, నీలుడూ, గవాక్షుడూ, కుముదుడూ లాటి వానర ముఖ్యులున్నారు. అంగదుడు వారిని చూసి, "మీరు మీ ఆత్మ గౌరవాన్నీ, పరాక్రమాన్నీ కూడా మరిచి, చచ్చుకోతుల్లాగా బెదిరిపోయి ఎక్కడికలా పారిపోతున్నారు? ఆ వచ్చేది యుద్ధం చేసే రాక్షసుడు కాదు, విభీషిక—భయం పుట్టించే బొమ్మ. వెనక్కు రండి, ఈ వెరబొమ్మను ధ్వంసం చేద్దాం," అన్నాడు.



అ మాటలతో ధైర్యం తెచ్చుకుని వాన రులు వెనక్కు తిరిగివచ్చి కుంభకర్ణుడిపై తలపడ్డారు. వాళ్ళు తనపై వేసిన కొండ రాళ్ళకూ, చెట్లకూ కుంభకర్ణు డేమాత్రమూ చలించలేదు, పైపెచ్చు కోపం తెచ్చుకుని వానరులను నిర్మూలించ సాగాడు.

ఆ దెబ్బతో వానరులు పరుగులంకించు కున్నారు. వాళ్ళు ఒకరి మీదుగా ఒకరు ఎగురుతూ పారిపోయారు. కొందరు ఆకాశం లోకి ఎగిరారు, కొందరు వెళ్ళి సముద్రంలో పడ్డారు, మరికొందరు సేతువు మీదుగా పారిపోయారు. భల్లూకాలు కొందరు చెట్ల లోనూ, మరికొందరు కొండలలోనూ దాక్కు న్నారు, కొందరు చతికిలపడ్డారు, కొందరు మూర్ఛపోయారు, కొందరు చచ్చినట్టు కదలకుండా పడుకున్నారు.

"ఆగండి! ఆగండి! వెనక్కు రండి!" అని అంగదుడు కేకపెట్టి వానరులను పిలి చాడు. యోధులైనవాళ్ళు శత్రువును చంపి కీర్తి గడించటమో, శత్రువు చేతిలో చచ్చి బ్రహ్మలోకానికి పోవటమో చెయ్యాలిగాని, ప్రాణాలు కాపాడుకోవటానికి పిరికిపంద ల్లాగా పారిపోరాదనీ, కుంభకర్ణుడికి రాముడి చేతిలో నిశ్చయంగా చావు మూడిందనీ అతను వానరులతో అన్నాడు. కాని వాళ్ళు, "కుంభకర్ణుడు మమ్మల్ని దారుణంగా చంపేస్తున్నాడు. మేము పోతాం. మాకు ప్రాణాలు దక్కితే చాలు," అని, కుంభ కర్ణుడు వస్తూండటం చూసి పారిపోయారు.

అయితే అలా పారిపోయే వానరులను అంగదుడూ, హనుమంతుడూ కలిసి మంచి మాటలతో నచ్చచెప్పి ఎలాగో వెనక్కు మరలించగలిగారు.

తరవాత హనుమంతుడు పన్నెండు మంది వానరయోధులను వెంటబెట్టుకుని యుద్ధానికి బయలుదేరాడు. వా రెవరంటే, ఋషభుడూ, శరభుడూ, మైందుడూ, ధూమ్రుడూ, నీలుడూ, కుముదుడూ, సుషే

ఖుడూ, గవాక్షుడూ, రంభుడూ, తారుడూ, ద్వివిదుడూ, పనసుడూనూ.

వీరంతా ఏకంగా చేసిన యుద్ధంలో అనేక మంది రాక్షసులు చచ్చారు, రథాలు నుగ్గయాయి, ఏనుగులూ, గుర్రాలూ, ఒంటెలూ చచ్చాయి. హనుమంతుడు గాలి లోకి ఎగిరి కుంభకర్ణుడి పైన కొండరాళ్ళ వర్షం కురిపించాడు, వృక్షాలు వేశాడు. కుంభకర్ణుడు వాటి నన్నిటినీ తన శూలంతో పక్కకు నెట్టేశాడు. కుంభకర్ణుడు వానరు లను తరుముతూ పోతూంటే హనుమంతు డొక పర్వతశిఖరం పట్టుకుని అతనికి అడ్డంగా నిలబడ్డాడు. దాన్నిపెట్టి హను మంతుడు కొట్టే సరికి కుంభకర్ణుడికి తల పగిలి, శరీరం రక్తంతో తడిసింది. వెంటనే కుంభకర్ణుడు తన శూలంతో రొమ్ములో పొడిచే సరికి, హనుమంతుడు నోట నెత్తురు కక్కుతూ మూర్ఛపోయాడు.

హనుమంతుడు పడగానే మళ్ళీ పారి పోసాగిన వానరులను నీలుడు నిలవవేసి, కుంభకర్ణుడిపై ఒక పెద్ద కొండరాయి వేశాడు. కుంభకర్ణుడు దాన్ని పిడికిలితో పొడిచి చూర్ణం చేశాడు. అయిదుగురు వానరవీరులు కుంభకర్ణుడిపై కలియబడి రాళ్ళతోనూ, చెట్లతోనూ కొట్టి, కాళ్ళతో,



చేతులతో తన్నారు. ఈ తాపులకు కుంభ కర్ణుడు చలించలేదు. అతను ఆ అయిదు గురినీ చంపేశాడు.

అది చూసి అనేక వేలమంది వానరులు కుంభకర్ణుడి పైన వచ్చి పడ్డారు. కుంభ కర్ణుడు వాళ్ళను పట్టుకుని తినసాగాడు. వానరులలో హహాకారాలు చెలరేగాయి. వాళ్ళు వెళ్ళి రాముణ్ణి శరణు జొచ్చారు.

అంగదుడు కుంభకర్ణుడి తలపైన పెద్ద కొండరాయి వేసి కొట్టాడు. కుంభకర్ణుడు మండిపడి శూలం విసిరితే అంగదుడు ఉపాయంగా తప్పించుకుని, చప్పున కుంభకర్ణుణ్ణి సమీపించి, రొమ్ముల్లో అదిరే

టట్టుగా కొట్టాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుడికి మూర్ఛ వచ్చింది. వెంటనే స్పృహ తెచ్చుకుని కుంభకర్ణుడు అంగదుణ్ణి ఎడమ చేతి పిడికిలితో పొడిచి మూర్ఛ పోగొట్టి, శూలాన్ని ఎత్తుకుని సుగ్రీవుడి పైకి వెళ్ళాడు.

కుంభకర్ణుడు తన శూలాన్ని గిరగిరా తిప్పి సుగ్రీవుడి పైన విసిరాడు. అంతలో హనుమంతుడు వచ్చి మధ్య దారిలో దాన్ని పట్టుకుని, రెండు చేతులా పట్టి విరిచి పారేశాడు. వెయ్యి బారువల ఇనుముతో చేసిన ఆ శూలం, హనుమంతుడు తన మోకాలికి పెట్టి విరవగానే పుల్లలాగా విరిగిపోయింది.

శూలం పోయేసరికి కుంభకర్ణుడు కోపించి ఒక రాయి విసిరి సుగ్రీవుణ్ణి మూర్ఛపోగొట్టాడు. మూర్ఛలో ఉన్న సుగ్రీవుణ్ణి కుంభకర్ణుడు పట్టుకుని ఎత్తుకుపోయాడు. సుగ్రీవుణ్ణి కాజేస్తే వానరసేనా, రామలక్ష్మణులూ నిర్వీర్యులయిపోతారని అతని ఉద్దేశం. అతను సుగ్రీవుణ్ణి తీసుకుని లంకకు వెళ్ళిపోయాడు. కుంభకర్ణుణ్ణి ఎదిరించి సుగ్రీవుణ్ణి విడిపించుదామా అని హనుమంతుడొక క్షణంపాటు ఆలోచించి, చివరకు అలా చేయటం అనవసరమని తేల్చుకున్నాడు. ఎందుచేతనంటే, స్పృహ తెలిసిన మరుక్షణం అతను తనను తానే విడిపించుకో గలడు. ఇలా ఆలోచించి హనుమంతుడు, బెదిరిన వానరులకు ధైర్యం చెబుతూ అక్కడే ఉండిపోయాడు.

లంకా పౌరులు కుంభకర్ణుడిపై చల్లిన సుగంధ జలాలతో సుగ్రీవుడికి స్పృహ వచ్చింది. తానిప్పుడు ఏవిధమైన ప్రతిక్రియ చేస్తే బాగుంటుందా అని అతను ఆలోచించాడు. చివరకతను తన గోళ్ళతో కుంభకర్ణుడి చెవులు గిల్లి, ముక్కూ, చెంపలూ కొరికేశాడు. కుంభకర్ణుడు అలిగి సుగ్రీవుణ్ణి నేలకేసి కొట్టి, తొక్కాడు. అయినా సుగ్రీవుడు లక్ష్యపెట్టక వాయువేగంతో గాలిలోకి లేచి రాముడున్న చోట వాలాడు.





# మయూరధ్వజుడు

ఒకప్పుడు ధర్మరాజు అశ్వమేధ యాగం తలపెట్టాడు. యజ్ఞాశ్వంగా ఎన్నుకోబడిన గుర్రాన్ని దేశం మీద వదిలిపెట్టారు. దానికి రక్షకుడుగా అర్జునుడూ, వెంట కొద్దిమంది సైనికులూ బయలుదేరారు. కృష్ణుడు అస్త్ర శస్త్రాలేవీ ధరించకుండా అర్జునుడికి తోడుగా వున్నాడు.

యజ్ఞాశ్వం నానా దేశాలూ తిరిగి తిరిగి, కొంత కాలానికి కౌండిన్య నగర పరిసరాలకు చేరుకుంది.

ఆ నగర యువరాజైన తామ్రధ్వజుడు యజ్ఞాశ్వాన్ని చూచి దాని ముఖం మీద కట్టబడివున్న పత్రాన్ని చదివాడు:

"ఇది ధర్మజుని యజ్ఞాశ్వం. దీని వెంట రక్షకుడుగా అర్జునుడు వస్తున్నాడు. ఈ అశ్వాన్ని ఎవరైనా పట్టుకున్నట్టయితే, వారికి మహావీరుడైన అర్జునుని చేతిలో పరాజయమో, మృత్యువో తప్పదు!"

"అర్జునుని కింత అహంకార మేమిటి? ఈ అహంకారాన్ని అణచి తీరవలసిందే!" అని నిర్ణయించుకున్నాడు తామ్రధ్వజుడు. వెంటనే ఆ యజ్ఞాశ్వాన్ని పట్టుకుని కట్టి వేశాడు. కాసేపటికల్లా సాయుధులైన సైనికులూ, గాండీవం ధరించి వున్న అర్జునుడూ, ఆ వెనుక కృష్ణుడూ అక్కడికి వచ్చారు.

"ఎవరీ యజ్ఞాశ్వాన్ని పట్టి బంధించింది?" అని అర్జునుడు తామ్రధ్వజుడిని ప్రశ్నించాడు. తామ్రధ్వజుడు నిర్భయంగా "నేనే," అని జవాబు చెప్పాడు.

"నువ్వు చిన్నవాడివి, కనుక క్షమిస్తున్నాను. అశ్వాన్ని వదిలిపెట్టు. ఈ అశ్వం ఎవరిదో, నే నెవరినో తెలుసా?" అన్నాడు అర్జునుడు.

"ఈ అశ్వం ఎవరిదో తెలిసే పట్టుకున్నాను. చేతనైతే వదిలించుకుని పోవచ్చు," అన్నాడు తామ్రధ్వజుడు.

అట్ట చివరి బొమ్మ



ఆ మాటలతో అర్జునుడికి పట్టరాని కోపం వచ్చింది. అతడు గాండీవం ఎక్కుపెట్టి, "నువ్వు కోరి మృత్యువును ఆహ్వానిస్తున్నావు!" అన్నాడు.

తామ్రధ్వజుడు కూడా బాణం ఎక్కుపెట్టి, ముందుకు వచ్చాడు. యుద్ధం ప్రారంభమయింది.

కొంతసేపు యుద్ధం జరిగిన తరవాత తామ్రధ్వజుడిదే పైచేయి అయే సూచనలు కనబడసాగినై. అర్జునుడి గాండీవం గాని, అతడి ధైర్యసాహసాలుగాని తామ్రధ్వజుణ్ణి చలింప చేయలేకపోయినై. ఈ పరిణామానికి ఆశ్చర్యపడుతూ, అర్జునుడు యుద్ధరంగం వదలి, దూరంగా నిలబడి వున్న కృష్ణుడి దగ్గిరకు వెళ్ళి, అవమానంతో కుమిలి పోతూ, "అనేక యుద్ధాల్లో ఆరితేరిన నాకు, ఈ బాలకుడి చేతిలో పరాజయ మేమిటి?" అని అడిగాడు.

కృష్ణుడు నవ్వుతూ, "యుద్ధం అన్న తర్వాత ఒకరికి జయం, మరొకరికి పరాజయం మామూలేకదా!" అన్నాడు.

"అది నిజమే కావొచ్చు, కాని నువ్వు పక్కన వుండగా నాకు పరాజయ మేమిటి?" అని ప్రశ్నించాడు అర్జునుడు.

"అర్జునా, మీ అన్న యుధిష్ఠిరుని ధర్మబలంకంటె, తామ్రధ్వజుని తండ్రి మయూరధ్వజుని ధర్మబలమేం తక్కువది కాదు. కనక పోరులో మీమీ శక్తిసామర్థ్యాలను బట్టి జయాపజయాలు కలిగినై," అన్నాడు కృష్ణుడు.

అర్జునుడు ఒక క్షణకాలం తలవంచుకుని, "నా గాండీవం సంగతీ, నా శౌర్య పరాక్రమాల సంగతీ అలా వుంచుదాం. పోతే, ధర్మజునితో సాటియైన ధార్మికుడు లోకంలో మరొక డున్నట్టు అంగీకరించమంటావా, నన్ను?" అని అడిగాడు.

"నిజానికి ధర్మజునికంటె కూడా మయూరధ్వజుడు ఎక్కువైన ధర్మాత్ముడు.

కావాలంటే రుజువు చేస్తాను, నా వెంటరా,'' అని కృష్ణుడు బయలుదేరాడు.

కృష్ణార్జునులు గురు శిష్యుల వేషంలో మయూరధ్వజుని సభకు వెళ్ళారు. మయూరధ్వజుడు సింహాసనం దిగి వచ్చి వారిని సగౌరవంగా ఆహ్వానించాడు.

"ఓ మయూరధ్వజ మహారాజా! నేను గొప్ప ఆపదలో వుండి నీ దగ్గరకు సహాయం కోరేందుకు వచ్చాను. అభయమిచ్చి సహాయం చేస్తానంటే, చెప్పగలను,'' అన్నాడు గురువు వేషంలో వున్న కృష్ణుడు.

అందుకు మయూరధ్వజుడు, "అభయమిస్తున్నాను. ఎలాంటి ఆపద నుంచి అయినా సరే నిన్ను కాపాడతాను,'' అన్నాడు.

"మహారాజా, అయితే వినండి. ఇవ్వాళ నా కుమారుడి వివాహం. నేను అతణ్ణి వెంటపెట్టుకుని కన్యాదాత గృహానికి పోతున్నాను. అడవి మార్గంలో మమ్మల్ని ఒక సింహం ఎదిరించి నా కుమారుణ్ణి ఆహారంగా తీసుకుంటానంది. నా కుమారుణ్ణి వదలవలసిందనీ, కావాలంటే నన్ను ఆహారంగా స్వీకరించమనీ అన్నాను. కాని, ఆ సింహం వృద్ధుడనైన నా మాంసం అక్కరలేదన్నది. మయూరధ్వజ మహారాజు కనక తనకు ఆహారమైతే, నా కుమారుణ్ణి విడిచి పుచ్చుతా




నన్నది. పుత్రుడి మీది మమకారం కొందికీ మీ దగ్గరకు వచ్చాను,'' అన్నాడు కృష్ణుడు.

అందుకు మయూరధ్వజుడు ఏమీ చలించకుండా, "ఓ బ్రాహ్మణోత్తమా! నా మాంసం సింహానికి ఆహారంగా యిచ్చి, నీ కుమారుణ్ణి నువ్వు రక్షించుకోవచ్చు,'' అన్నాడు.

"మహారాజా, మీ ధర్మబుద్ధికి నే నెంతో కృతజ్ఞుణ్ణి. సింహం మీ శరీరం అంతా కాక, కుడివైపు భాగాన్నే కోరింది. అదీ మీ భార్యాపుత్రులు కంట తడిపెట్టకుండా కోసి యిస్తేనే స్వీకరించగలనని చెప్పింది,'' అన్నాడు కృష్ణుడు.

మయూరధ్వజుడు అందుకు అంగీకరించాడు. కాని సభాసదుల్లో గగ్గోలు ప్రారంభమయింది. ఈ వార్త విన్న మయూరధ్వజుడి భార్య దుఃఖిస్తూ వచ్చి భర్త పాదాల మీద వాలిపోయింది.

మయూరధ్వజుడు మంత్రికి చెప్పి ఒక రంపం తెప్పించాడు. ఆ రంపాన్ని భార్యా, కుమారుడూ రెండు వైపులా పట్టుకుని తన శరీరంలోని కుడి భాగాన్ని ఖండించి బ్రాహ్మణునకు యివ్వవలసిందని వారిద్దరినీ ఆజ్ఞాపించాడు.

ఆ ఆజ్ఞ మేరకు భార్యా, కుమారుడూ రంపం పట్టుకుని తన శరీర భాగాన్ని కోయబోతూ వుండగా, మయూరధ్వజుడి ఎడమ కంటిలో నీళ్ళు తిరిగినై.

అది గమనించిన కృష్ణుడు, "రాజా, మీరు దుఃఖిస్తున్నారు. మీరు ఆ విధంగా యిచ్చిన దానం వల్ల నా కేమీ ఫలితం కలగదు," అన్నాడు.

"బ్రాహ్మణోత్తమా, నేను దుఃఖించటం లేదు. నా శరీరంలోని కుడి భాగం ఒక గొప్ప ధర్మ కార్యానికి వినియోగపడుతున్నది. అదే విధంగా ఎడమ భాగం కూడా సద్వినియోగం అయితే ఎంత బావుండునని మాత్రమే విచారిస్తున్నాను," అన్నాడు మయూరధ్వజుడు,

ఆ క్షణంలో కృష్ణార్జునులు తమ నిజ రూపంలో మయూరధ్వజుడికి కనిపించారు. భక్తితో చేతులు మోడ్చి నమస్కరించిన మయూరధ్వజుణ్ణి, కృష్ణుడు దీవించాడు. తరవాత అర్జునుడి కేసి తిరిగి, "అర్జునా, యిప్పటికి నిన్ను పట్టిపీడిస్తున్న భ్రమలన్నీ తొలగిపోయిన వనుకుంటాను," అన్నాడు.

"నా భ్రాంతి తొలిగింది. క్షమించండి," అన్నాడు అర్జునుడు. కృష్ణుడు, అర్జున తామ్రధ్వజులకు సఖ్యం కుదిర్చాడు. మయూరధ్వజ మహారాజును ధర్మరాజు చేయనున్న అశ్వమేధ యాగానికి ఆహ్వానించాడు.



ప్రపంచపు వింతలు :

# 38. కార్నాక్ ఆలయ ద్వారం

ఈజిప్టులోని కార్నాక్ ఆలయాల శిథిలాలకు ఇది ద్వారం; జగత్ప్రసిద్ధి గలది. దీని నిర్మాణం క్రీస్తు పూర్వం 246-222 సంవత్సరాల మధ్య మూడవ టొలమీ కాలంలో జరిగింది. ద్వారం పై భాగాన ఉన్నది సూర్యుడి చిహ్నం. కింద ఉన్న బొమ్మలలో రాజు దేవతా ప్రార్థనలు చెయ్యటం కనిపిస్తుంది.



Photo by Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

బొచ్చుకుక్క ముక్కు చూచి

పంపినవారు :
ఎం. పి. కె. రావు, నారాయణపేట

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1965 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బొచ్చుకుక్క ముక్కు చూచి

రెండవ ఫోటో : చక్కనమ్మ వెక్కిరించె

పంపినవారు : ఎం. పి. కన్నేశ్వరరావు,

నారాయణపేట (మహబూబ్‌నగర్ జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ:

# నాకు అసలే ఏలినాటి శని, పైగా అష్టమ రాసిలో గురువు




"నీ బాధల కారణమునకు నీ జాతకము చూడ నక్కరలేదు! నువ్వు అలిసిపోయి నీర్సముగా ఎందుకూ పనికిరాకుండా ఉన్నట్లు ఎన్నో నెలల నుండి చూస్తున్నాను! నువ్వు డాక్టరు దగ్గరకు వెడితే మంచిది!" అంది అత్తయ్య. "ఊరుకో తల్లీ, ఎప్పుడూ డాక్టర్లూ, మందులూ అనే ధోరణే నీకు" అన్నాను. కాని ఆవిడ పట్టుపట్టి నన్ను డాక్టరు దగ్గరకు తీసుకు వెళ్ళింది.



డాక్టరు నన్ను పరీక్షచేసి యిలా అన్నారు. "మీ ఒంట్లో ఏమీలేదు. మీకు నీర్సముగా, అలసటగా ఉన్నట్లు ఉండడము తగినంత పోషణ లేదనడానికి చిహ్నము. మీరు రోజూ హార్లిక్స్ త్రాగండి." నాకు హార్లిక్స్ ఎందుకు అనుకొని నేను ఎరుగున్న సిద్ధాంతితో ఆ సంగతే అన్నాను. ఆయన "డాక్టర్లు చెప్పినట్లు చేయడమే మంచిది." అన్నారు.



అందువలన, ఒక మంచి రోజు చూసుకొని హార్లిక్స్ త్రాగడము ప్రారంభించేను. నాకు క్రమంగా శక్తి ఉత్సాహములు కలిగేయి. ఇంట్లో అత్తయ్యా వాళ్ళు సంతోషించేరు. నా గ్రహస్థితి బాగుండడము వల్లనే డాక్టరు నాకు హార్లిక్స్ సిఫార్సు చేసేరని నేను ఎంతో సంతోషించేను!




## హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

IWT-HL-4023

## కాలేజిలో ప్రతి రోజూ చురుకుగా ఉండడం ముఖ్యం ...

# టినోపాల్ అదనపు తెల్లదనం యిస్తుంది.

తెల్ల బట్టలు మరింత అందంగా ఉంటాయి



చాలా చురుకైన పిల్ల. కాలేజికి గర్వకారణం. బాగా చదువుతుంది. చక్కగా తయారవుతుంది. ధగధగ మెరిసే తెల్లబట్టలు ప్రతిరోజూ ధరిస్తుంది— అందరి తెల్లబట్టలకంటే తెల్లటివి! కారణం?—టినోపాల్!




ఆఖరున ఝాడించేటప్పుడు మీ తెల్ల బట్టలకు కొద్ది టినోపాల్ కలిపితే—చీరలు, ఫ్రాక్‌లు, చొక్కాలు, లాగులు, దుప్పట్లు—అన్నిటికీ ఎంతో అద్భుతమైన వ్యత్యాసం కలుగుతుంది. అయితే దీనికయ్యే ఖర్చు ఎంత? బట్టకి ఒక్క పైసా కూడా కాదు. అందమైన తెల్లబట్టల కోసం ప్రతి రోజూ టినోపాల్ వాడండి—చురుకైనవాళ్ళు ప్రతిచోటా ఎన్నిక చేసేది దీన్నే. టినోపాల్ నూలు బట్టలకైనా, మరే బట్టలకైనా ఏవిధమైన హానీ చెయ్యదు. ఎందుకంటే యిది ఆధునిక సైంటిఫిక్ పద్ధతిలో తెల్లబట్టలకు అదనపు తెల్లదనం యిస్తుంది.




టినోపాల్, జె.ఆర్.గైయిగి ఎస్.ఎ. బాల్, స్విట్జర్లెండ్‌వారి రిజిస్టరు చేయబడిన ట్రేడ్ మార్కు.

సుహృద్ గైయిగి లిమిటెడ్,
పి. ఒ. బాక్స్ 965, బొంబాయి-1. బి. ఆర్.

Shilpi SGT 122 TEL

